# हिन्दी तेलुगु स्वबोधिनी

## హిందీ తెలుఁగు స్వబోధిని

प्रकाशक

दक्षिण भारत हिन्दुस्तानी प्रचार सभा,

मद्रास।

# हिन्दी तेलुगु स्वबोधिनी

## హిందీ తెలుఁగు స్వబోధిని

లేఖకులు :

మోటూరి సత్యనారాయణ

మరియు

పండిత అవధనందన్

ప్రకాశకులు

దక్షిణ భారత హిందుస్తానీ ప్రచార సభ,

త్యాగరాయనగరు, మదరాసు.

 1950 [दाम 1—8—0

# విన్నపము

హిందీ భాష నభ్యసించుటకై యీ పుస్తకమెంతయో యుపయోగ పడఁగలదు. పాఠకులు హిందీ వ్యాకరణమునంతను నీ పుస్తకముద్వారా నేర్చుకొనఁగలరు. ఇందు వ్యాకరణముయొక్క ప్రధానాంశములన్నియును సాంగోపాంగముగ సులభశైలిలో వ్రాయఁబడుటచేఁ జదువరు లెంతమాత్రము విసుగులేక హిందీ భాషయొక్క సామాన్య జ్ఞానమునకు వలయు వ్యాకరణము నంతయు నేర్చుకొనఁగలరు.

ఎంత ప్రయత్నించినను, వ్యాకరణ నియమములకై, కొన్ని సాంకేతిక శబ్దముల నుపయోగింపక తప్పినదిగాదు. పాఠకులు వానిని వల్లించుట కంటె, వాటిక్రింద యివ్వబడిన అభ్యాసవాక్యములద్వారా సులభముగా తెలిసికొనఁగలరు. హిందీ వ్యాకరణమును బోధించుటయే యీ పుస్తకము యొక్క ముఖ్యోద్దేశమగుటచే ఆంధ్రభాషా వ్యాకరణ సాంప్రదాయముల కనుకూలమైన శబ్దములను ఎక్కువగా నుపయోగింపవలను పడినదిగాదు. కనుక పాఠకులు పోల్చదగిన ప్రదేశములయందే తెలుఁగు సాంప్రదాయములతో పోల్చుకొనుచు భాష నభ్యసించుట లాభదాయకము.

భూతకాలమునందు కర్తతో నుపయోగింపబడెడు 'ने' ప్రత్యయము, ఆవశ్యకతాబోధకమగు 'चाहिये' నుపయోగించునప్పుడు కర్తకు 'को ప్రత్యయముఁజేర్చుట, షష్ఠీవిభక్తి ప్రత్యయములగు का, के, की ల యొక్క ప్రయోగమున్ను, जो యను సంబంధ సర్వనామము మొదలగునవి చాల జాగ్రత్తగా పఠించుట అవసరము. మూడవ పాఠమునందిచ్చియున్న

'శ, ష, క్ష' నియమమును జక్కఁగాఁ దెలిసికొనినచో పరిశుద్ధమగు భాష మాట్లాడుటకును, వ్రాయుటకును నుపకరించును. ఈ పుస్తకమునందు పాఠకులు ముఖ్యముగా గమనింపవలసిన విషయము వేఱొండుఁగలదు. ఏమన, సాధారణ వ్యవహారిక భాష కవసరములగు విషయములన్నియు మొదటి యిరువదియైదు పాఠములలో వివరింపఁబడియున్నవి. అందువలన జదువరు లాపాఠములలో నెంతమాత్రము తొందరఁ జెందక క్రమక్రమముగా నభ్యసించి, తరువాత సభవారిచే బ్రచురింపఁబడిన వాచక పుస్తకములను, కథల పుస్తకములను స్వయముగా జదువుకొనవలయును.

రూపాంతర మొనర్పుటలో నెల్లూరు కాలేజి హిందీ పండితులగు భట్టారం వెంకట సుబ్బయ్యగారు మిగుల సహాయ మొనర్చిరి గనుక వారికి మా కృతజ్ఞతా పూర్వక వందనములు.

ప్రకాశకులు.

# విషయసూచిక

అనుబంధము 1.



అనుబంధము 2.

| పాఠము విషయము | | పుట. |
|---|---|---|
| గుణకారములు, రూపాయలోని విభాగములు, తులమానము, కాలమానము | .... | 172 |
| ఋతువుల పేర్లు, వారములు, నెలలు, దిక్కులు, ఖాద్యపదార్థములు | .... | 173 |
| మసాలా ద్రవ్యములు | .... | 174 |
| పండ్లు, ధాన్యములు, కూరకాయలు, శరీరావయవములు | .... | 175 |
| మృగములు, పక్షులు | .... | 177 |
| బంధుత్వము | .... | 178 |
| ఖనిజాంద్రము, లోహములు, రత్నములు | .... | 179 |
| వ్యాధులు | .... | 180 |

శ్రీ

# हिन्दी तेलुगु स्वबोधिनी

## హిందీ తెలుఁగు స్వబోధిని

### వర్ణమాల

స్వర్ (అచ్చులు 13)

హిందీ భాష దేవనాగరి లిపిలో వ్రాయుదురు.

| అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ |
|---|---|---|---|---|---|
| **अ** | **आ** | **इ** | **ई** | **उ** | **ऊ** |

| ఋ | ఏ | ఐ | ఓ | ఔ |
|---|---|---|---|---|
| **ऋ** | **ए** | **ऐ** | **ओ** | **औ** |

| అం | అః |
|---|---|
| **अं** | **अः** |

---

సూచన :—అచ్చులలో హ్రస్వ ఎ. ఒ కారములు లేవు ౠ, ఌ, ౡ ఈ అక్షరములు హిందీ భాషయందనవసరమగుటచేత వదలివేయబడినవి. "అం" యొక్క ఉచ్చారణ అర్ధానునాసికముగా నుండును.

## వ్యంజన్ (హల్లులు 33.)

### వర్గాక్షరములు

| క | ఖ | గ | ఘ | ఙ |
|---|---|---|---|---|
| क | ख | ग | घ | ङ |
| చ | ఛ | జ | ఝ | ఞ |
| च | छ | ज | झ | ञ |
| ట | ఠ | డ | ఢ | ణ |
| ट | ठ | ड | ढ | ण |
| త | థ | ద | ధ | న |
| त | थ | द | ध | न |
| ప | ఫ | బ | భ | మ |
| प | फ | ब | भ | म |

### అవర్గాక్షరములు

| య | ర | ల | వ | శ | ష | స | హ |
|---|---|---|---|---|---|---|---|
| य | र | ल | व | श | ष | स | ह |

---

సూచన:—अ, आ, ओ, औ, अं, अः, ऋ, झ, ण, ल, श ఈ అక్షరములు క్రమముగా నీ క్రింది విధమునగూడ వ్రాయుదురు.

अ, आ, ओ, औ अं, अः, अृ, झ, ण, ल, श।

## గుణింతము.

హల్లులతో గలిసియున్నప్పుడు అచ్చురూపము లిట్లుండును—

| अ | आ | इ | ई | उ | ऊ | ऋ |
|---|---|---|---|---|---|---|
|  | ा | ि | ी | ु | ू | ृ |

| ए | ऐ | ओ | औ | अं | अः |
|---|---|---|---|---|---|
| े | ै | ो | ौ | ं | ः |

(1) అచ్చులేని హల్లు పలుకబడదు. अ అక్షరమునకు వేరు గుర్తు లేదు. హల్లు క్రింద నీ '\' గుర్తున్నప్పుడు అచ్చులేని హల్లులని తెలుసుకొనవలయును ;—क् క్ + अ = क క.

(2) **आ, ई, ओ, औ** అక్షరముల గుర్తులు హల్లుల తరువాత చేర్చబడును.

ఉదాహరణము :—का కా. की కీ. को కో. कौ కౌ.

(3) इ కార గుర్తు హల్లులకు వెనుకను ए, ऐ హల్లులకు పైనను उ, ऊ, ऋ కార గుర్తులు హల్లులకు క్రిందను చేర్చబడును.

ఉదా :—कि కి. के కే. कै కై. कु కు. कू కూ. कृ కృ.

(4) అనుస్వారము (ं) లేక అనునాసికము (ँ) అక్షరమునకు పైన, విసర్గము (:) అక్షరమునకు కుడివైపున చేర్చబడును.

ఉదా :—कं, कँ, कः (కం. కఁ. కః).

(5) उ, ऊ (ు, ూ) లయొక్క గుర్తులు र అక్షరముతో కలుపునప్పుడు వాని రూపము లీరీతిగ నుండును.

ఉదా :—रु రు, रू రూ వ్రాయవలెనుగాని र‍ु र‍ू అని వ్రాయుట తప్పు.

(6) హిందీలో గుణింతమునకు " **बारह खड़ी** = బారహ్ ఖడీ " అని పేరు.

क् + अ = (క్ + అ = క) = क

क् + आ = (క్ + ఆ = కా) = का

क् + इ = (క్ + ఇ = కి) = कि

क् + ई = (క్ + ఈ = కీ) = की

क् + उ = (క్ + ఉ = కు) = कु

क् + ऊ = (క్ + ఊ = కూ) = कू

क् + ऋ = (క్ + ఋ = కృ) = कृ

क् + ए = (క్ + ఏ = కే) = के

क् + ऐ = (క్ + ఐ = కై) = कै

क् + ओ = (క్ + ఓ = కో) = को

क् + औ = (క్ + ఔ = కౌ) = कौ

क् + अं = (క్ + అం = కం) = कं

क् + अः = (క్ + అః = కః) = कः

### అచ్చు గుణింతములు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| क | का | कि | की | कु | कू | कृ |
| క | కా | కి | కీ | కు | కూ | కృ |
| के | कै | को | कौ | कं | कः | |
| కే | కై | కో | కౌ | కం | కః | |
| च | चा | चि | ची | चु | चू | चृ |
| చ | చా | చి | చీ | చు | చూ | చృ |
| चे | चै | चो | चौ | चं | चः | |
| చే | చై | చో | చౌ | చం | చః | |

| ह | हा | हि | ही | हु | हू | हृ |
|---|---|---|---|---|---|---|
| హ | హా | హి | హీ | హు | హూ | హృ |
| हे | है | हो | हौ | हं | हः | |
| హే | హై | హో | హౌ | హం | హః | |
| र | रा | रि | री | रु | रू | |
| ర | రా | రి | రీ | రు | రూ | |
| रे | रै | रो | रौ | रं | रः | |
| రే | రై | రో | రౌ | రం | రః | |

## సంయుక్తాక్షరములు (హల్లు గుణింతములు).

సంయుక్తాక్షర నిర్మాణమును సులభగ్రాహ్య మొనర్చుకొనుటకై హల్లులను మూడువిధములుగ విభజింపుడు.

(1) నిలువుగీత 'ा' గలవి, (2) నిలువుగీత లేనివి, (3) రేఫము.

**ङ, छ, ट, ठ, ड, ढ, द, र, ह** అక్షరములు తప్ప మిగిలిన అక్షరములన్నియు నిలువుగీత గలవి.

(1) నిలువుగీతగల అక్షరము మరియొక అక్షరముతో కలుపునప్పుడు నిలువుగీత 'ा' ను తీసివేసి తరువాత అక్షరములో చేర్చవలయును.

ఉదా :— प् + य = प्य ప్య      त् + म् = य = त्म्य త్మ్య

स् + त् = य = स्त्य స్త్య    (अगस्त्य) (అగస్త్య)

(2) **ङ, छ, ट, ठ, ड, ढ, ह** ఈ హల్లులను ఇతర అక్షరములతో కలుపునప్పుడు మొదటి అక్షరము పూర్తిగ వ్రాసి రెండవ అక్షరముమీది అడ్డ గీత (–) తీసివేసి మొదటిదాని క్రింద చేర్చవలయును.

ఉదా :—श + व = श्व

| | |
|---|---|
| उच्छ्वास ఉచ్ఛ్వాస్ (ఉచ్ఛ్వాసము) | अङ्कुर అఙ్కుర్ (మొలక) |
| टट्टी టట్టీ (తడిక) | हड्डी హడ్డీ (ఎముక) |
| प्रह्लाद ప్రహ్లాద్ | सह्याद्रि సహ్యాద్రి |

(3) రేఫయుక్తమైన సంయుక్తాక్షరమునందు र (వెలుపలిగిలక) రేఫము మొదట పలుకబడునెడల అక్షరముయొక్క తలకట్టుమీద ఈ (र्‍) గుర్తు ఉంచబడును.

ఉదా :—र + म = र्म ర్మ. धर्म ధర్మ. कर्म కర్మ. सूर्य సూర్య.

र (క్రావడి) రేఫము అక్షరము తరువాత ఉచ్చరింపబడునెడల రెండవ అక్షరముక్రింద ' ^ ' ఇట్టి గుర్తు ఉంచబడును.

ఉదా :—म् + र = म्र మ్ర. आम्र ఆమ్ర. चक्र చక్ర. भद्र భద్ర.
ह्रस्व హ్రస్వ. वज्र వజ్ర.

छ, ट, ठ, ड, ढ ఈ అక్షరముల క్రిందమాత్రము ' ^ ' ఈ గుర్తు ఉంచబడును.

ఉదా :—राष्ट्र రాష్ట్ర. त्रिपुण्ड्र త్రిపుండ్ర.

ఎట్టి నియమములకూ లోబడిన ఈ క్రింది సంయుక్తాక్షరములను బాగుగా గమనింపుడు.

| | |
|---|---|
| क् + क = क्क, क्क క్క | व् + व = व्व వ్వ |
| ल् + ल = ल्ल, ल्ल ల్ల | क् + ल = क्ल, क्ल క్ల |
| क् + त = क्त క్త | ज् + ञ = ज्ञ జ్ఞ |
| क् + ष = क्ष క్ష | ट् + य = ट्य ట్య |
| च् + च = च्च చ్చ | त् + त = त्त త్త |
| त् + र = त्र త్ర | द् + व = द्व ద్వ |
| द् + द = द्द ద్ద | श् + र = श्र శ్ర |

| | |
|---|---|
| द् + घ = द्घ ద్ఘ | श् + च = श्च శ్చ |
| द् + न = द्न ద్న | ह् + व = ह्व హ్వ |
| द् + म = द्म ద్మ | ह् + म = ह्म హ్మ |
| द् + य = द्य ద్య | ह् + य = ह्य హ్య |
| श् + व = श्व శ్వ | ड् + य = ड्य డ్య |

## కొన్ని అక్షరముల ఉచ్చారణ భేదము.

హిందీలో సాధారణముగా ఉర్దూ, అరబీ, ఫార్సీ, ఇంగ్లీషు మొదలగు భాషలయొక్క పదములు వాడబడుటచేత వాటిని ఉచ్చరించుటకై ఈ క్రింది అక్షరముల క్రింద చుక్క '.' నుంచుదురు.

**क़, ख़, ग़, ज़, ड़, ढ़, फ़** ఈ యక్షరముల ఉచ్చారణముస్పష్టముగా తెలియపరచుట కష్టము, గావున హిందీ ఉర్దూభాషల నెరిగినవారి ద్వారా తెలిసికొనుట మంచిది. అయినను ఈ క్రింది నియమములు గమనార్హములు :—

(1) **क़, ख़, ग़** వీని ఉచ్చారణ **क, ख, ग** (క, ఖ, గ) భేదము ప్రకారము ఉగ్గుపెట్టునప్పుడు చంటిబిడ్డల కంఠ ధ్వనివలె నుండును.

ఉదా :—**क़त** కత్ (పాళి) **क़दम** కదమ్ (పాదము)

**ख़बर** ఖబర్ (సంగతి) **ग़म** గమ్ (దుఃఖము)

**ग़लत** గలత్ (తప్పు)

(2) **ज़** దీని యుచ్చారణ తెలుగులోని 'జ' లేక ఇంగ్లీషు 'Z' జడ్ లోని 'జ' అక్షర ధ్వనివలెనుండును.

ఉదా :—**ज़मानत** జమానత్ (జామీను ) **चीज़** చీజ్ (వస్తువు)

(3 ) **ड़, ढ़** వీనిని ఉచ్చరించునప్పుడు నాలుక బాగుగా అంగిలికి డకార, ఢకార భేదమునను సరించి స్పర్శించవలెను.

ఉదా—**सड़क** సడక్ (త్రోవ). **अपढ़** అపఢ్ (చదువనివాడు).

(4) **फ़** దీని యుచ్చారణ ఇంగ్లీషులో 'F' యఫ్ అను అక్షరము లోని 'ఫ' ధ్వనివలె నుండును.

ఉదా :—**फ़कीर** ఫకీర్ (బిచ్చగాడు).

## హిందీ శబ్దోచ్చారణ నియమములు.

(1) హిందీలో పదముల యంత్యాక్షరమందలి '**अ**' కారము ఉచ్చరింపబడదు.

ఉదా :—**बात** బాత్ (మాట) **रात** రాత్ (రాత్రి)

**अब** అబ్ (ఇప్పుడు) **धन** ధన్ (ధనము)

**फल** ఫల్ (పండు) **घर** ఘర్ (ఇల్లు)

(2) కాని చివరనున్న అక్షరము సంయుక్తాక్షరమైనచో పూర్తిగానే యుచ్చరింపబడును.

ఉదా :—**सत्य** సత్య **इन्द्र** ఇంద్ర **धर्म** ధర్మ

(3) **इ, ई, उ** వీని తరువాత '**य**' అక్షరమున్నయెడల '**य**' మీది అకారము పూర్తిగానే పలుకబడును.

ఉదా :—**प्रिय** ప్రియ **सीय** సీయ

**राजसूय** రాజసూయ

(4) మూడు హ్రస్వ అకార అక్షరములుగల మాటలయందు మూడవ అక్షరము, నాలుగు హ్రస్వ అకారములుగల మాటలయందు రెండవ నాలుగవ అక్షరములు, అయిదు హ్రస్వ అకారములుగల మాటలయందు మూడవ, అయిదవ అక్షరములు, పూర్తిగా పలుకబడవు.

ఉదా :—**कलम** కలమ్ **अदरख** అద్రఖ్ (అల్లము)

**झटपट** ఝట్పట్ **गपड़चौथ** గపడ్చౌథ్ (వ్యర్థగోష్ఠి)

(5) మూడు అక్షరములుగల దీర్ఘస్వరాంత పదములలో రెండవ అక్షరముమీది అకారము పలుకబడదు.

ఉదా :—**बकरा** బక్‌రా (మేకపోతు)      **कपड़ा** కప్‌డా (బట్ట)

**बोलना** బోల్‌నా (మాటలాడుట)

నాలుగు అక్షరములుగల శబ్దములలో రెండవ అక్షరము సంయుక్తాక్షరమైనప్పుడును పదముయొక్క మొదటి అక్షరము సంయుక్తాక్షరమైనప్పుడును రెండవ అక్షరమునందలి అకారము పూర్తిగా పలుకబడును.

ఉదా :—**पुत्रलाभ** (పుత్రలాభ్)      **प्रचलित** (ప్రచలిత్)

(6) నాలుగు అక్షరములుగల దీర్ఘస్వరాంత శబ్దములందు మూడవ అక్షరముమీది అకారము పలుకబడదు.

ఉదా :—**समझना** సమఝ్‌నా (తెలిసికొనుట)

**कचहरी** కచ్‌హరీ (కచ్చేరి)

## అనుస్వారమును గురించి

(1) హిందీలో '.' ఈ గుర్తు అనుస్వారము, 'ँ' ఈ గుర్తు అనునాసికము (అర్ధానుస్వారము) అని చెప్పబడును.

(అ) హిందీ పదములమీది అనుస్వారము ముక్కుతో పలుకబడును.

(ఆ) తెలుగులో 'అలాగా' అను అర్థమును తెలియజేయు "ఊఁ హాఁ" లో ధ్వని ఊఁ హాఁలలోని నాసికధ్వనివలె నుండును. దీనిని వ్రాతలో 'అర్ధానుస్వారము,' 'అనునాసికము' అందురు. దీనికి ప్రత్యేకముగా 'ँ' ఈ రూపము ఉన్నను కొందరు కేవలము '.' ఇట్లే వ్రాయుదురు. అయినను దీనిని అనునాసికముగానే ఉచ్చరింపవలయును.

ఉదా :—**गेहूँ, गेहूं** - గోధుమలు      **आँख, आंख** ఆఁఖ్ - కన్ను

**पाँच, पांच** పాఁచ్ - ఐదు      **गेंद** గేఁద్ - బంతి

**मैं** మైఁ - నేను.      **में** మేఁ - అందు, లో

(2) అనుస్వారమునకు తరువాత వర్గాక్షరములున్నచో అనుస్వారమునకు బదులు ఆ వర్గ పంచమాక్షరము వచ్చును.

అనగా **शंकर** అను శబ్దములో అనుస్వారము తరువాత '**क** క' వచ్చినది. ఇది వర్గమునకు చేరినది. పై నియమము ప్రకారము 'క' కు ముందు ఆవర్గ అంత్యాక్షరము '**ङ** ఙ్' వ్రాయవలెను. అనగా **शङ्कर** అని వ్రాయవలెను. ఇట్లే అన్నిచోట్ల జరుగునది.

ఉదా :— **मंगल = मङ्गल**　　**दंड = दण्ड**

**संजय = सञ्जय**　　**गुंफ = गुम्फ**

**आनंद = आनन्द**

(3) కాని అనుస్వారము తరువాత ఆ వర్గాలలోని ఏ అక్షరము వచ్చినను అనుస్వారము '**न्** వలె పలుకబడును.

ఉదా :— **संसार, संशय, हंस, दंश**

**सन्सार, सन्शय, हन्स, दन्श**

ఈ క్రింది వాక్యములను చదువుడు :—

I

**अब, एक, ऐन, ईख, आम, ऊन, ईद, ऋण, तव, चल, कल, छत, घर, झट, रथ, ठग, सच, यश, तब, पढ़, षण, हम, गज, लड़, धन, फल, भज, हँस।**

II

**नरम, गरम, सड़क, औषध, गलत, महक, शहर, खर्च, सनद, कनक, ऊपर, ऐनक, जगह, भड़बड़, झटपट, सरपट, शरबत, मसनद, करतब, चहलपहल, सलतनत, हरजगह, अकलमंद।**

III

**काम, नाम, ताजा, बाजा, दिन, निधि, ऋषि, माली, गाली, चीनी, गुण, सुन, झूठ, भूल, रूप, केला,**

मेला, रेल, सेवा, मैला, कैसा, थैली, मोती, धोती, रोटी, मौनी, कौन, कृपा, किताब, मैदान, डिगरी, रुपया, रूमाल, बहादुर, बेईमान, बुलबुल, शिकायत, मेहरबानी।

IV

घण्टा, ध्यान, स्याही, किश्ती, ग्वाला, ज़्यादा, तस्वीर, प्यास, स्वप्न, स्मरण, स्तुति, सज्जन, ज़ुल्म, टट्टू, हड्डी, भद्दा, पक्का, पद्य, द्वेष, व्यर्थ, श्लोक, श्रावण, आह्लाद, असह्य, विद्यार्थी, हृदय, ब्राह्मण, मत्स्य, ज्ञान, पाठ्य, ड्योढ़ी, ट्राम, प्राण, क्षेत्र, ह्रास, कृतघ्न।

V

इधर आओ। उधर बैठो। हिन्दी बोलो। ख़ुश रहो। भाई आया। रामनाथ गया। वह बहुत रोया। वह कौन है? वहाँ क्या है? मैं आदमी हूँ। यह सुनो। एक कथा कहो। राम को बुलाओ। पाठ याद करो। चंचल मत बनो। हिंसा मत करो। हिन्दुस्तान की भाषा सीखो।

वह घर जाता है। सीता क्या लिखती है? आप कौन हैं? रामप्रसाद क्या लिखता है? यह आम का पेड़ है। गाय दूध देती है। तुम को क्या काम है? वह झूठ बोलता है। ख़रगोश सरपट भागा। वहाँ क्या गड़बड़ है? बुलबुल उड़ गयी। बेईमान का विश्वास मत करो। आपकी मेहरबानी चाहिये। इस जंगल में शेर नहीं है। गोखलेजी हमारे

देश के बड़े नेता थे। हमारे देश का नाम भारतवर्ष है। यह बड़े-बड़े ऋषि-मुनियों की जन्म-भूमि है। मैं अपने देश को प्यार करता हूँ।

VI

गोपाल नाम का एक लड़का था। वह बड़ा खिलाड़ी था। वह एक रोज़ कुछ लड़कों को अपने संग लेकर जंगल में खेलने गया। सब लड़के दिन भर वहाँ खेलते रहे। शाम हुई। जब अंधेरा चारों ओर फैल गया, तब वहाँ एक बाघ आया और खिलाड़ी लड़कों पर झपटा। सब लड़के तो एक पेड़ पर चढ़ गये। पर गोपाल को पेड़ पर चढ़ना नहीं आता था। वह घबड़ाकर इधर-उधर भागने लगा। शेर ने झट उसे पकड़ लिया और उसे लेकर जंगल में चला गया।

साहित्य राष्ट्र का जीवन-स्रोत है। रक्तप्रवाहिनी नालिकाओं से जिस प्रकार शरीर में रक्त दौड़ जाता है, उसी प्रकार साहित्य की भिन्न शाखाओं से राष्ट्र को पुरुषत्व प्राप्त होता है। यदि राष्ट्र का उद्धार करना है, उसके अस्थि-पंजर में संजीवनी शक्ति डालना है, तो साहित्य की गति में शीघ्र ही परिवर्तन कर देना होगा। उसमें जीवन का पुरुषार्थ और तेजस्विता भरनी होगी। क्या मनोराज्य उत्पन्न करने-वाले साहित्यक बन्धु इस महत्वपूर्ण सन्देश को हृदयङ्गम करेंगे ?

———

## పాఠము 1.

| | |
|---|---|
| * यह ఇది. ఈ | वह అది. ఆ |
| क्या ఏమి | कहाँ ఎక్కడ |
| है ఉన్నది | हैं ఉన్నవి |
| और మరియు | भी కూడ |
| में అందు. లో | पर మీద. పైన |
| कागज़ కాగితము | क़लम కలము (స్త్రీ) |
| स्याही సిరా (స్త్రీ.) | हाथ చేయి |
| मेज़ మేజా. బల్ల (స్త్రీ.) | कुर्सी కుర్చీ (స్త్రీ.) |
| किताब పుస్తకము (స్త్రీ.) | ज़मीन నేల (స్త్రీ.) |

### అభ్యాస వాక్యములు

| | |
|---|---|
| वह क्या है? | అది ఏమిటి? |
| वह किताब है। | అది పుస్తకము. |
| किताब कहाँ है? | పుస్తకము ఎక్కడ ఉన్నది? |
| किताब मेज़ पर है। | పుస్తకము బల్లపైనున్నది. |
| ज़मीन पर क्या है? | నేలమీద నేమున్నది? |
| ज़मीन पर मेज़ है। | నేలమీద బల్లయున్నది. |
| कुर्सी कहाँ है? | కుర్చీ ఎక్కడ ఉన్నది? |
| कुर्सी भी ज़मीन पर है। | కుర్చీకూడ నేలమీద నున్నది. |
| यह क्या है? | ఇది ఏమిటి? |
| यह कलम है। | ఇది కలము. |

---

* ఈ పుస్తకమునందు మాటలు ఎడమవైపునుండి కుడివైపునకు చదువవలెను.

(స్త్రీ.) గుర్తుగల శబ్దములు స్త్రీలింగములుగను మిగిలినవి పుంలింగములుగను ఎరుగునవి. హిందీలో నపుంసకలింగము లేదు.

| | |
|---|---|
| कलम कहाँ है ? | కలము ఎచ్చటనున్నది ? |
| कलम हाथ में है। | కలము చేతిలో నున్నది. |
| कलम में क्या है ? | కలములో నేమున్నది ? |
| कलम में स्याही है। | కలములో సిరా ఉన్నది. |
| कुर्सी और मेज़ कहाँ है ? | కుర్చీయు, బల్లయు ఎక్కడ యున్నవి ? |
| कुर्सी और मेज़ ज़मीन पर है। | కుర్చీయు, బల్లయు నేలమీదనున్నవి. |
| वह कागज़ कहाँ है ? | ఆ కాగితము ఎక్కడనున్నది ? |
| कागज़ और कलम मेज़ पर है। | కాగితమును, కలమును బల్లమీద నున్నవి. |

(1) హిందీ వాక్యములందు కర్త, కర్మ, క్రియలు తెలుగులోవలె వరుసగా నుండును.

సూచన :—తెలుగులో నొక్కొక్కచో క్రియాపదమును విడిచిపెట్టవచ్చును, అట్లు హిందీలో విడువరాదు.

ఉదాహరణము :—అదేమైయున్నది అనుదానిలో క్రియను వదలి అదేమి అని చెప్పనట్లుగ "**वह क्या**" అని చెప్పరాదు. "**है**" చేర్పవలెను.

---

## పాఠము 2.

### విధ్యర్థకము (ఆజ్ఞ)
### (*Imperative*)

| | | |
|---|---|---|
| **तू** నీవు | **तुम** మీరు | **आप** తమరు |
| **आ** రా (వచ్చు) | **जा** పో (పోవు) | **खा** తిను |
| **पी** త్రాగు | **कर** చేయు | **रह** ఉండు, నివసించు, ఆగు |
| **उठ** లే (లేచు) | **बैठ** కూర్చొను, ఆగు | **लिख** వ్రాయు |
| **पढ़** చదువు | **दे** ఇమ్ము (ఇచ్చు) | **ले** తీసికొను |
| **देख** చూడు (చూచు) | **ला** తెమ్ము (తెచ్చు) | ***मत** వద్దు |

* సూచన :—ఇది మధ్యమపురుషయందే అనగా **तू**, **तुम**, **आप** కర్తలుగానుండునపుడు వాడబడును.

(2) తెలుగులోవలెనే ధాతురూపమే విధ్యర్థకమగును. విధ్యర్థకములు మూడు విధములు.

మొదటిది—నీచార్థకము. సంభాషణలో నుపయోగింపబడుట తక్కువ.

ఉదా :—तू जा నీవు వెళ్లు तू पढ़ నీవు చదువు

రెండవది—పిన్నలతోను, సమవయస్కులతోను, ఎక్కువ పరిచయముగలవారితోను మాటలాడునపుడు మధ్యమపురుష బహువచనము "तुम మీరు" వాడుదురు. అపుడు ధాతురూపమునకు "ओ" చేర్చవలెను. ఇందు दे, ले క్రియారూపములు మాత్రము వేరుగానుండును.

ఉదా :—तुम (सुन + ओ) सुनो మీరు వినుడు.
तुम (खा + ओ) खाओ మీరు తినుడు.
तुम (सो + सो) सोओ మీరు నిద్రించుడు.

दे, ले వీని రూపములు.

ఉదా :—तुम (दे + ओ) दो మీరు ఇయ్యండి.
तुम (ले + ओ) लो మీరు తీసికొనుడు.

మూడవది—గౌరవాచకముగు "आप" కర్తగానున్నప్పుడు విధ్యర్థకములో ధాతురూపమునకు "इये" చేర్చవలెను.

ఉదా :—आप (पढ़ + इये) पढ़िये తమరు చదవండి.
आप (खा + इये) खाइये తమరు తినండి.
आप (सो + इये) सोइये తమరు నిద్రించండి.

కాని दे (ఇచ్చు), ले (తీసికొను), पी (త్రాగు), कर (చేయు) ఈ క్రియలకు మాత్రము క్రమముగ ఈ క్రింది రూపములు వాడబడును.

आप दीजिये తమరు ఇవ్వండి. आप लीजिये తమరు తీసికొనండి.
आप पीजिये తమరు త్రాగండి. आप कीजिये తమరు చేయండి.

"**मत**" (వద్దు) వ్యతిరేకార్థవిధి. ఇది క్రియాపదమునకు పూర్వము చేరుచుండును.

ఉదా :—तू मत लिख నీవు వ్రాయకు.

तू मत देख నీవు చూడకు.

तुम मत सोओ మీరు నిద్రింపకుడు.

आप मत सुनिये తమరు వినకండి.

आप यह काम मत कीजिये తమరు యీ పని చేయకుడు.

## అభ్యాస వాక్యములు.

| | |
|---|---|
| तुम आओ। | మీరు రండి. |
| कुर्सी पर बैठो। | కుర్చీమీద కూర్చొనుడు. |
| यह किताब पढ़ो। | ఈ పుస్తకమును చదువుడు. |
| हाथ में कलम लो। | చేతి (లోనికి) కలము తీసికొనుడు. |
| कागज़ पर लिखो। | కాగితముమీదవ్రాయుము (వ్రాయుడు). |
| आप मेज़ पर मत बैठिये। | తమరు బల్లమీద కూర్చొనకుడు. |
| कुर्सी पर बैठिये। | కుర్చీమీద కూర్చుండుడు. |
| यह किताब मत पढ़िये। | ఈ పుస్తకము చదువకుడు. |
| वह काम मत कीजिये। | ఆ పని చేయకుడు. |
| वह किताब और यह क़लम दीजिये। | ఆ పుస్తకమును మరియు ఈ కలమును ఇవ్వండి. |
| यह पीजिये। | ఇది త్రాగండి. |
| तू उठ। | నీవు లే. |
| ज़मीन पर मत बैठ। | నేలమీద కూర్చొనవద్దు |
| जा और वह कुर्सी ला। | పో. ఆ కుర్చీ తెమ్ము. |
| देख, ज़मीन पर क्या है? | చూడు. నేలమీద ఏమున్నది. |
| आप भी रहिये। | తమరుకూడ ఉండండి. |

## పాఠము 3.

### క్రియలు—వర్తమానకాలము

#### సర్వనామములు

| | |
|---|---|
| **मैं** నేను | **हम** మేము, మనము |
| **तू** నీవు | **तुम** మీరు, **आप** తమరు |
| **वह** వాడు, ఆమె, అది | **वे** వారు, అవి |

#### సహాయకక్రియలు

| | |
|---|---|
| **मैं हूँ** నేను ఉన్నాను | **हम हैं** మేము ఉన్నాము |
| **तू है** నీవు ఉన్నావు | { **तुम हो** మీరు ఉన్నారు<br>{ **आप हैं** తమరు ఉన్నారు |
| **वह है** వాడు ఉన్నాడు, అది ఉన్నది, ఆమె ఉన్నది | **वे हैं** వారు ఉన్నారు (స్త్రీ. పు.) అవి ఉన్నవి |

"వారు" అను బహువచన శబ్దమును మర్యాదకుగాను తెలుగులో ఏకవచనమునందుపయోగించునట్లు హిందీలో "वे" అను శబ్దమును ఉపయోగించెదరు. అనగా ఆయన ఎవరు?—వారు ఎవరు? అనునట్లు హిందీలో **वे कौन हैं** అందురు.

3. వర్తమానకాలమందు తెలుగులో క్రియతోగూడ "చు" చేర్చునట్లు హిందీలో **ता, ते, ती** చేర్చెదరు. కర్త పుంలింగ ఏకవచనములో నున్నపుడు క్రియకు '**ता**' కర్త పుంలింగ బహువచనములో నున్నపుడు '**ते**' కర్త స్త్రీలింగ ఏకవచన, బహువచనములలో క్రియకు '**ती**' యును చేర్చి అవసరమగు సహాయక క్రియ చేర్చిన సామాన్య వర్తమానకాలము (తద్ధర్మము) అగును.

ఉదా :—राम आ + ता है రాముడు వచ్చుచు ఉన్నాడు.

राम आ + ते हैं రాములు వచ్చుచు ఉన్నారు.

सीता आ + ती है సీత వచ్చుచు ఉన్నది.

పుంలింగము

| ఏకవచనము. | బహువచనము. |
|---|---|
| मैं आता हूँ నేను వచ్చుచున్నాను | हम आते हैं మేము వచ్చుచున్నాము |
| तू आता है నీవు వచ్చుచున్నావు | तुम आते हो మీరు వచ్చుచున్నారు<br>आप आते हैं తమరు వచ్చుచున్నారు |
| वह आता है వాడు వచ్చుచున్నాడు | वे आते हैं వారు వచ్చుచున్నారు |

స్త్రీలింగము

| | |
|---|---|
| मैं आती हूँ నేను వచ్చుచున్నాను | हम आती हैं మేము వచ్చుచున్నాము |
| तू आती है నీవు వచ్చుచున్నావు | तुम आती हो మీరు వచ్చుచున్నారు<br>आप आती हैं తమరు వచ్చుచున్నారు |
| वह आती है ఆమె వచ్చుచున్నది | वे आती हैं వారు వచ్చుచున్నారు |

సూచన :—అన్ని క్రియలకును వర్తమానకాలము ఇట్లే యుండును.

4. "ఆ" కారాంతములగు పుంలింగ నామవాచకములు విశేషణములు, భూత, భవిష్యత్, వర్తమాన క్రియారూపములయొక్క కడపటి 'आ' కారమును ए గా మార్చిన బహువచనములుగను, ई గా మార్చిన స్త్రీలింగములుగను అగును. ఈ నియమమును आ, ए, ई నియమమందురు. ఇది హిందీ వ్యాకరణములో ముఖ్యముగా గమనింపదగినది.

నామవాచకములు

| | |
|---|---|
| घर ఇల్లు | पाठशाला, (स्त्री.) मदरसा పాఠశాల |
| भात అన్నము | रोटी (स्त्री.) రొట్టె |

दूध పాలు

काम పని

पाठ, सबक़ పాఠము

अलमारी బీరువ (స్త్రీ.)

हाँ అవును, సరే

इधर ఇటువైపు

क्या ఏమి

पानी నీరు

चिट्ठी (స్త్రీ.) ఉత్తరము, చీటి

तमाशा తమాషా, వేడుక, వింత

चटाई (స్త్రీ.) చాప

नहीं లేదు, కాదు

उधर అటువైపు

कहाँ ఎక్కడ

సూచన :—వ్యతిరేకార్థక వాక్యములలో నెల్లప్పుడు వ్యతిరేకార్థక శబ్దము క్రియకుముందే యుండును.

हूँ, है, हैं, हो సహాయక క్రియలు వ్యతిరేకార్థక వాక్యములలో లోపించును.

ఉదా :—मैं दूध नहीं पीता నేను పాలు త్రాగను.

वह घर नहीं जाता వాడు యింటికి వెళ్లడు.

| | |
|---|---|
| तुम क्या लिखते हो। | మీరేమి వ్రాయుచున్నారు? |
| मैं चिट्ठी लिखता हूँ। | నేను ఉత్తరము వ్రాయుచున్నాను. |
| वह इधर क्या काम करता है? | వాడిచ్చట నేమి పని చేయుచున్నాడు? |
| तू उधर कहाँ जाता है? इधर आ। | నీవు అటు ఎక్కడికి పోవుచున్నావు? ఇటు రా? |
| आप घर जाते हैं? | తమరు ఇంటికి వెళ్లుచున్నారా? |
| नहीं, मैं पाठशाला जाता हूँ। | లేదు, నేను బడికి పోవుచున్నాను. |
| तुम क्या पीते हो? | మీరు ఏమి త్రాగుచున్నారు? |
| मैं दूध नहीं पीता, पानी पीता हूँ। | నేను పాలుత్రాగను, నీళ్లు త్రాగుదును. |
| ऊर्मिला उधर क्या देखती है? | ఊర్మిల అటు ఏమి చూచుచున్నది? |
| वह तमाशा देखती है? | ఆమె వేడుక చూచుచున్నది. |
| मैं कुर्सी पर बैठती हूँ; तुम मेज़ पर बैठो। | నేను కుర్చీమీద కూర్చుందును (స్త్రీ.) మీరు బల్లపై కూర్చోండి. |

| | |
|---|---|
| अलमारी में क्या किताब है ? | అలమారాలో ఏమి పుస్తకమున్నది ? |
| अलमारी में हिन्दी किताब है। | అలమారాలో హిందీ పుస్తకముఉన్నది. |
| हाँ, मैं चिट्ठी लिखती हूँ। | అవును, నేను ఉత్తరము వ్రాయుచున్నాను. (స్త్రీ.) |
| यह दूध आप पीजिये। | ఈ పాలు తమరు త్రాగుడు. |
| वे चटाई पर बैठती हैं। | వారు (స్త్రీలు) చాపమీద కూర్చుంటున్నారు. |
| मैं दूध पीता हूँ। | నేను పాలు త్రాగుచున్నాను. |
| तुम सबक पढ़ते हो। | మీరు పాఠము చదువుచున్నారు. |
| हम तमाशा देखते हैं। | మేము వింత చూచుచున్నాము. |
| वे कुर्सी पर बैठते हैं। | వారు కుర్చీమీద కూర్చొనుచున్నారు. |

---

## పాఠము 4.

### ప్రశ్నార్థకములు

| | |
|---|---|
| क्या ఏమి | कहाँ ఎక్కడ |
| कौन ఎవడు, ఏది | किधर ఏవైపు |
| कब ఎప్పుడు | कितने ఎన్ని |
| क्यों ఎందుకు | कितना ఎంత |
| अब ఇప్పుడు | कैसे ఎట్లు |
| यहाँ ఇక్కడ | वहाँ అక్కడ |
| आज నేడు | अभी ఇప్పుడే |
| कभी कभी అప్పుడప్పుడు | रोज़ ప్రతిదినము |
| बजे గంటలు, వేళను | हमेशा ఎల్లప్పుడు |
| कुछ కొంచెము, కొందరు | दिन పగలు, దినము |
| से లో, నుండి | बहुत చాల |

| | | |
|---|---|---|
| १. **एक** ఒకటి | २. **दो** రెండు | ३. **तीन** మూడు |
| ४. **चार** నాలుగు | ५. **पाँच** అయిదు | ६. **छः** ఆరు |
| ७. **सात** ఏడు | ८. **आठ** ఎనిమిది | ९. **नौ** తొమ్మిది |
| | १०. **दस** పది | |

5. ప్రశ్నించునపుడు తెలుగులో సాధారణముగ వాక్యమునకు కడపట "ఆ" చేర్చునట్లు అనగా (వెళ్లుచున్నారు+ఆ=వెళ్లుచున్నారా ?) (వలె) హిందీలో వాక్యమునకు ముందు **क्या** చేర్చుదురు.

ఉదా :—**क्या तुम घर जाते हो ?** మీరింటికి వెళ్లుచున్నారా ? కాని సాధారణముగా సంభాషణయందు **क्या** వదలివేసి కడపట అక్షరమును ప్రశ్నార్థకధ్వని గలుగునట్లు పల్కిన చాలును.

ఉదా :—**तुम घर जाते हो ?** మీరింటికి వెళ్లుచున్నారా ?

| | |
|---|---|
| **वह कौन है ?** | ఆయన ఎవరు ? |
| **वह रामचन्द्र है ।** | ఆయన రామచంద్రుడు. |
| **रामचन्द्र यहाँ रोज़ क्यों आता है ?** | రామచంద్రుడిచ్చటికి ప్రతిదినము ఎందుకు వచ్చుచున్నాడు ? |
| **वह रोज़ नहीं आता, कभी-कभी आता है ।** | ఆయన ప్రతిదినము రాడు. అప్పుడప్పుడు వచ్చుచుండును. |
| **आज तुम कहाँ जाती हो ?** | నేడు మీరు ఎక్కడకు వెళ్లుచున్నారు ? (స్త్రీ.) |
| **मैं आज पाठशाला जाती हूँ ।** | నేను నేడు బడికి వెళ్లుచున్నాను (స్త్రీ.) |
| **अब कितने बजे हैं ?** | ఇప్పుడెన్ని గంటలు (కొట్టినది) ? |
| **अभी नौ बजे हैं ।** | ఇప్పుడే తొమ్మిది (కొట్టినది). |
| **क्या तुम हमेशा नौ बजे पाठशाला जाती हो ?** | మీరు రోజు తొమ్మిది గంటలకు బడికి పోయెదరా ? |
| **नहीं आज वहाँ कुछ काम है ।** | లేదు, నేడు అచ్చట కొంచెము పని యున్నది. |

| | |
|---|---|
| तुम यहाँ कब से रहते हो ? | మీరు యిచ్చట ఎప్పటినుండి ఉన్నారు? |
| मैं सात दिन से यहाँ रहता हूँ। | నేను ఏడు రోజులనుంచి యిక్కడ ఉంటున్నాను. |
| आप कलम से क्यों लिखती हैं, पेनसिल से लिखिये। | తమరు(స్త్రీ)కలముతో ఎందుకు వ్రాయుచున్నారు, పెన్సిలుతో వ్రాయండి. |
| राम, तुम कब कलकत्ते जाते हो ? | రామా, మీరు కలకత్తాకు ఎప్పుడు వెళ్లెదరు? |
| मैं आज कलकते जाता हूँ। | నేను నేడు కలకత్తాకు వెళ్లుచున్నాను. |
| सीता, आज आप क्या किताब पढ़ती हैं। | సీతా, నేడు తమరు ఏ పుస్తకము చదువుచున్నారు? |
| मैं स्वबोधिनी पढ़ती हूँ। | నేను స్వబోధిని చదువుచున్నాను. |
| क्या आप भात खाते हैं ? | తమరు అన్నము తినుచున్నారా? |
| नहीं, मैं रोटी खाता हूँ। | లేదు, నేను రొట్టె తినుచున్నాను. |
| आप अभी घर जाते हैं ? | తమరు ఇప్పుడే ఇంటికి వెళ్లుచున్నారా? |
| हाँ, मैं अभी जाता हूँ। | అవును, నేను ఇప్పుడే వెళ్లుచున్నాను. |
| वे रोज़ चार बजे पाठशाला से घर आते हैं ? | వారు ప్రతిదినము నాలుగు ఘంటలకు పాఠశాలనుండి యింటికి వచ్చుచున్నారు. |
| विशालाक्षी हमेशा हिन्दी पढ़ती है ? | విశాలాక్షి ఎల్లప్పుడు హిందీ చదువుచుండునా? |
| मोहन दो दिन से यहाँ रहता है। | మోహనుడు రెండు రోజులనుండి ఇచ్చట ఉంటున్నాడు. |
| वे बहुत काम करते हैं। | వారు చాల పని చేయుచున్నారు. |

## పాఠము 5.

### తాత్కాలిక వర్తమానకాలము

సామాన్య వర్తమానకాలమును గురించి మూడవ పాఠములో చదివియే యున్నారు. ధాతువు తరువాత చేర్చబడిన **ता** కు బదులుగా **रहा** చేర్చిన తాత్కాలిక వర్తమానకాల మనబడును.

#### పుంలింగము

| ఏకవచనము | బహువచనము |
| --- | --- |
| **मैं जा रहा हूँ** నేను వెళ్లుచూ ఉన్నాను | **हम जा रहे हैं** మేము వెళ్లుచూ ఉన్నాము |
| **तू जा रहा है** నీవు వెళ్లుచూ ఉన్నావు | **तुम जा रहे हो** మీరు వెళ్లుచూ ఉన్నారు<br>**आप जा रहे हैं** తమరు వెళ్లుచూ ఉన్నారు |
| **वह जा रहा है** వాడు వెళ్లుచూ ఉన్నాడు | **वे जा रहे हैं** వారు వెళ్లుచూ ఉన్నారు |

#### స్త్రీలింగము

| ఏకవచనము | బహువచనము |
| --- | --- |
| **मैं जा रही हूँ** నేను వెళ్లుచూ ఉన్నాను | **हम जा रही हैं** మేము వెళ్లుచూ ఉన్నాము |
| **तू जा रही है** నీవు వెళ్లుచూ ఉన్నావు | **तुम जा रही हो** మీరు వెళ్లుచూ ఉన్నారు<br>**आप जा रही हैं** వారు వెళ్లుచూ ఉన్నారు |
| **वह जा रही है** ఆమె వెళ్లుచూ ఉన్నది | **वे जा रही हैं** వారు వెళ్లుచూ ఉన్నారు |

#### నామవాచకములు

| | |
| --- | --- |
| **आदमी** మనుష్యుడు | **औरत, स्त्री** స్త్రీ |
| **लड़का** పిల్లవాడు | **लड़की** బాలిక |
| **गाँव** గ్రామము | **शहर** పట్టణము |
| **गाड़ी** బండి (స్త్రీ.) | **नौकर** నౌకరు |

#### క్రియలు

| | |
| --- | --- |
| **गा** పాడు | **हँस** నవ్వు |
| **खेल** ఆడు | **बरस** వర్షించు |

तुम कहाँ जा रहे हो ?
मैं स्टेशन जा रहा हूँ ।
मोहन क्या कर रहा है ?
वह कुर्सी पर बैठ रहा है ।
कमला क्या पढ़ रही है ?
कमला चिट्ठी पढ़ रही है ।
पानी कौन ला रहा है ?
नौकर पानी ला रहा है ।
आप क्या लिख रहे हैं ?
मैं हिन्दी लिख रहा हूँ ।
वे वहाँ क्या देख रहे हैं ?
वे वहाँ तमाशा देख रहे हैं ।
आप क्या ले रहे हैं ?
मैं रोटी ले रहा हूँ ।
सीता कहाँ जा रही है ?
आज वह कलकत्ते जा रही है ।
तुम क्यों हँस रही हो ?
वह लड़का गाँव जा रहा है ।

मैं गा रही हूँ ।
यह लड़की दूध पी रही है ।
वह औरत शहर जा रही है ।
गोमती खेल रही है ।
गाड़ी जा रही है ।
पानी बरस रहा है ।

మీరు ఎక్కడకు వెళ్లుచూ ఉన్నారు ?
నేను స్టేషనుకు వెళ్లుచూ ఉన్నాను.
మోహనుడు ఏమి చేయుచూ ఉన్నాడు?
వాడు కుర్చీమీద కూర్చొనుచూ ఉన్నాడు.
కమల ఏమి చదువుచూ ఉన్నది ?
కమల ఉత్తరము చదువుచూ ఉన్నది.
నీళ్లు ఎవరు తెచ్చుచూ ఉన్నారు ?
నౌకరు నీళ్లు తెచ్చుచూ ఉన్నాడు.
తమరు ఏమి వ్రాయుచూ ఉన్నారు ?
నేను హిందీ వ్రాయుచూ ఉన్నాను.
వారచ్చట ఏమి చూచుచూ ఉన్నారు ?
వారచ్చట తమాషా చూచుచుఉన్నారు.
తమరేమి తీసుకొనుచూ ఉన్నారు ?
నేను రొట్టె తీసుకొనుచూ ఉన్నాను.
సీత ఎక్కడకు వెళ్లుచూ ఉన్నది ?
నేడు ఆమె కలకత్తా వెళ్లుచూ ఉన్నది.
మీరు ఎందుకు నవ్వుచూ ఉన్నారు ?
ఆ పిల్లవాడు గ్రామము వెళ్లుచూ ఉన్నాడు.

నేను పాడుచూ ఉన్నాను.
ఈ బాలిక పాలు త్రాగుచూ ఉన్నది.
ఆ స్త్రీ పట్టణమునకు వెళ్లుచూ ఉన్నది.
గోమతి ఆడుకొనుచూ ఉన్నది.
బండి వెళ్లుచూ ఉన్నది.
వాన కురియుచూ ఉన్నది.

## పాఠము 6.

### విశేషణములు

| | |
|---|---|
| **अच्छा** మంచి | **बुरा, खराब** చెడ్డ |
| **बड़ा** పెద్ద | **छोटा** చిన్న |
| **मोटा** లావైన, బలసిన | **पतला** సన్నని |
| **लंबा** పొడుగైన | **चौड़ा** వెడల్పైన |
| **मीठा** తియ్యని | **कड़ुआ** చేదైన |
| **ऊँचा** ఎత్తైన | **नीचा** తగ్గైన |
| **वह** ఆ | **वे** ఆ (బహు) |
| **यह** ఈ | **ये** ఈ (బహు.) |

**ठीक** సరియైన

### నామవాచకములు

| | |
|---|---|
| **फल** పండు | **पेड़** చెట్టు |
| **मकान** ఇల్లు, భవనము | **कमरा** గది |
| **कपड़ा** వస్త్రము | **घड़ी** గడియారము |
| **घोड़ा** గుఱ్ఱము | **हाथी** ఏనుగ |

**दाम** ధర

6. హిందీలో సాధారణముగా ఆకారాంతములును, ఆకారాంత ములును అగు శబ్దములు పుంలింగముగ నుండును, నపుంసకలింగము లేదు.

7. ఆకారాంత పుంలింగ శబ్దములు తప్ప ఇతర పుంలింగ శబ్దములు ఏమియును బహువచనమునందు మార్పుబొందవు.

| | |
|---|---|
| ఉదా :—**घर** ఇల్లు | **घर** ఇండ్లు |
| **मुनि** ముని | **मुनि** మునులు |
| **गुरु** గురువు | **गुरु** గురువులు |
| **डाकू** దొంగ | **डाकू** దొంగలు |

ఆకారాంత శబ్దములు आ, ए, ई నియమము ననుసరించి (నియమము 4) మార్పుజెందును.

8. విశేషణములు సామాన్యముగా విశేష్యమునకు అనగా నామవాచకమునకు ముందే వచ్చుచుండును.

ఉదా :—वह अच्छा बालक है వాడు మంచి బాలుడు. కాని కొన్ని చోట్ల నామవాచకమునకు తర్వాతనే వాడబడుచుండును.

ఉదా :—वह बालक अच्छा है ఆ బాలుడు మంచివాడు.

9. ఆకారాంత విశేషణమునకు పిదప పుంలింగ బహువచన నామవాచక పదము వచ్చుచో आ ఆ, ए ఏగా మారును. స్త్రీలింగ పదము వచ్చుచో ఆ आ కారము ఈ ई కారముగా మారును.

ఉదా :—अच्छा लड़का మంచి బాలుడు.

अच्छे लड़के మంచి బాలురు.

अच्छी लड़की మంచి బాలిక.

సూచన :—आ, ए, ई నియమము ననుసరించి విశేషణరూపములు భేదము పొందును (నియమము 4) చూడుడు.

| | |
|---|---|
| राम अच्छा लड़का है। | రాముడు మంచి బాలుడు. |
| देवकी एक छोटी लड़की है। | దేవకి చిన్న బాలిక. |
| यह आदमी लम्बा है। | ఈ మనుష్యుడు పొడుగుగా నున్నాడు. |
| हम मीठे फल खाते हैं। | మేము తియ్యనిపండ్లు తినుచున్నాము. |
| यह फल कड़ुआ है, यह मत खाओ। | ఈ పండు చేదుగా నున్నది. ఇది తినవద్దు. |
| देखो, वे पेड़ कितने ऊँचे हैं। | చూడు. ఆ చెట్లు ఎంత ఎత్తుగానున్నవో. |
| कलकत्ता बड़ा शहर है। | కలకత్తా గొప్ప పట్టణము. |
| पल्लेपाडु एक छोटा गाँव है। | పల్లెపాడు ఒక చిన్న పల్లె. |

| | |
|---|---|
| ये आदमी बहुत लंबे हैं। | ఈ మనుష్యులు చాల పొడవైనవారు. |
| यह औरत बहुत मोटी है। | ఈ స్త్రీ చాల స్థూలముగ నున్నది. |
| वह काग़ज़ बहुत चौड़ा नहीं है। | ఆ కాగితము చాల వెడల్పుగాలేదు. |
| तुम ये मीठे फल कहाँ से लाते हो? | మీరీ తియ్యని పండ్లు ఎక్కడ నుంచి తెచ్చుచున్నారు. |
| वह छोटी लड़की कहाँ काम करती है? | ఆ చిన్న పిల్ల ఎక్కడ పనిచేయు చున్నది? |
| जानकी अच्छी हिन्दी लिखती है। | జానకి మంచి హిందీ వ్రాయును (స్త్రీ.) |
| ये कमरे चौड़े नहीं हैं। | ఈ గదులు వెడల్పుగ లేవు. |
| वे बहुत ख़राब आदमी हैं। | వారు చాల చెడ్డ మనుష్యులు. |
| यह मकान छोटा है। | ఈ ఇల్లు చిన్నది. |
| तुम यह पतला कपड़ा कहाँ से लाते हो? | మీరు ఈ సన్న గుడ్డ ఎక్కడ నుండి తెచ్చుచున్నారు? |
| यह छोटी घड़ी ठीक चलती है। | ఈ చిన్న గడియారము బాగుగా నడచు చున్నది (పనిచేయుచున్నది). |
| शहर में बहुत आदमी रहते हैं। | పట్టణములో చాల మంది నివసించు చున్నారు. |
| यह कुर्सी बहुत छोटी है। | ఈ కుర్చీ చాల చిన్నది. |
| आप बड़े आदमी हैं। | తమరు గొప్పవారు. |
| वह ठीक दो बजे आता है। | అతడు సరిగ రెండు గంటలకు వచ్చు చున్నాడు. |
| यह हाथी बहुत बड़ा है। | ఈ ఏనుగు చాల పెద్దది. |
| ये घोड़े बहुत अच्छे हैं। | ఈ గుఱ్ఱములు చాల మంచివి. |
| यह मकान नीचा है। | ఈ ఇల్లు క్రిందగా నున్నది. |

## పాఠము 7.

### విభక్తి ప్రత్యయములు

**को** ని, ను, కి, కు (ద్వితీయా విభక్తి)

**से** చేత, తో (తృతీయా విభక్తి)

**को, के लिये, के वास्ते** కొఱకు, కై (చతుర్థీ విభక్తి)

**से** వలన, నుండి, కంటె (పంచమీ విభక్తి)

**का, के, की** యొక్క (షష్ఠీ విభక్తి)

**में** లో, **पर** మీద (సప్తమీ విభక్తి)

సూచన :—ఈ విభక్తులలో కొన్ని లోగడ పాఠములలో వాడబడినవి.

10. ద్వితీయావిభక్తి ప్రత్యయమగు **को** సాధారణముగా ప్రాణివాచకములకే చేర్చబడును. అప్రాణివాచకములకు సాధారణముగా చేర్చబడదు.

ఉదా :—**एक आदमी को लाओ** ఒక మనుష్యుని తీసికొనిరమ్ము.
**सीता को देखो** సీతను చూడుము.
**एक फल लाओ** ఒక పండును తెమ్ము.
**घर जाओ** ఇంటికి పొమ్ము.

11. షష్ఠీవిభక్తి ప్రత్యయములు **का, के, की** వీని ప్రయోగ మెల్లప్పుడును వాని తరువాత వచ్చు నామవాచకముయొక్క లింగవచనముల ననుసరించియుండును.

1. ప్రత్యయము తరువాత వచ్చు నామవాచకము పుంలింగ ఏకవచనమైనచో **का** వచ్చును.

ఉదా :—**राम का घर** రాముని ఇల్లు పుంలింగ ఏకవచనము.
**सीता का भाई** సీత తమ్ముడు (మొ).
**भाई** పుంలింగము—కావున "**का**" వాడబడెను.

2. के ప్రయోగములు రెండు విధములు.

(అ) ప్రత్యయము తరువాత వచ్చు నామవాచకము పుంలింగ బహువచనమైనచో के వాడబడును.

ఉదా :—राम के घोड़े రాముని గుఱ్ఱములు.

सीता के लड़के సీతయొక్క బిడ్డలు.

(ఆ) ప్రత్యయము తరువాత వచ్చు నామవాచకము ఏకవచనమైనప్పటికిని దానితోకూడ నేరైన నింకొక ప్రత్యయము వచ్చుచో का కు బదులు के వాడబడును.

ఉదా :—राम का घर రాముని యిల్లు.

राम के घर में రాముని యింట్లో.

ఇక్కడ घर అను పదము ఏకవచనమైనను దానికి में అను ప్రత్యయము వచ్చినందున का ప్రత్యయము के గా మారినది.

ప్రత్యయము తరువాత వచ్చు నామవాచకము స్త్రీలింగము (ఏకవచనమందును, బహువచనమందును) అయినచో की వచ్చును.

ఉదా :—राम की लड़की రాముని కూతురు.

राम की पुस्तकें రాముని పుస్తకములు.

12. ఆకారాంత పుంలింగ ఏకవచన శబ్దమునకు ప్రత్యయము వచ్చినచో కడపటి "आ" కారము ए కారమగును.

घोड़ा గుఱ్ఱము      घोड़े पर గుఱ్ఱముమీద.

పుంలింగ శబ్దమునకుముందు 'आ' కారాంత విశేషణ మున్నచో ప్రత్యయము వచ్చినపుడు ఆ విశేషణములో 'आ' కారముగూడి (నామవాచకములోని आ వలెనే) ए గా మారును.

ఉదా :— बड़ा घोड़ा పెద్ద గుఱ్ఱము.

बड़े घोड़े को పెద్ద గుఱ్ఱమునకు.

కొన్ని నామవాచకములు

| | |
|---|---|
| दिन పగలు | रात రాత్రి (స్త్రీ.) |
| सुबह ఉదయము | शाम సాయంత్రము |
| दवात సిరాబుడ్డి | रुपया రూపాయి |
| बाप, पिता తండ్రి | माँ, माता తల్లి |
| भाई సోదరుడు | बहिन సోదరి |
| बैल ఎద్దు | गाय ఆవు |

ఉదయమున అనుటకు सुबह में సాయంత్రమున అనుటకు शाम को అని వాడుదురు.

కొన్ని క్రియలు

| | | |
|---|---|---|
| सो నిద్రించు | जाग మేల్కొను | बोल మాట్లాడు |
| सुन విను | चल వెళ్లు | जान ఎఱుగు |

| | |
|---|---|
| यह गोपाल का घर है। | ఇది గోపాలుని ఇల్లు. |
| गोपाल के घर में कौन रहता है? | గోపాలుని యింటిలో ఎవరు నివసించుచున్నారు ? |
| गोपाल के घर में रामचन्द्र का भाई रहता है। | గోపాలుని యింటిలో రామచంద్రుని సోదరుడు నివసించుచున్నాడు. |
| मैं आपके लिये एक अच्छी किताब लाती हूँ। | నేను తమకొరకు ఒక మంచి పుస్తకము తెచ్చుచూ ఉన్నాను. |
| ये मीठे फल आपकी बहिन के वास्ते हैं। | ఈ తియ్యని పండ్లు మీ సోదరి కొఱకు (అయియున్నవి). |
| आज वे भी स्कूल से आते हैं। | నేడు వారుకూడ బడినుండి వచ్చుచూ ఉన్నారు. |

| | |
|---|---|
| आपको अच्छा दूध कौन देता है ? | తమకు మంచి పాలు ఎవడిచ్చుచున్నాడు ? |
| तुम दिन में भी सोते हो ? | మీరు పగలుకూడా నిద్రించుచున్నారా ? |
| नहीं, मैं दिन में नहीं सोता ; मैं रात में सोता हूँ और दिन में काम करता हूँ। | లేదు, నేను పగలు నిద్రించను. రాత్రి నిద్రించెదను పగలు పనిచేసెదను* (తద్ధర్మకము). |
| नारायणस्वामी रोज़ सुबह पाँच बजे जागता है। | నారాయణస్వామి ప్రతి దినము ఉదయము ౫ ఘంటలకు మేల్కొను (చున్నాడు) ను. |
| आपकी दवात में अच्छी स्याही नहीं है। | తమ సిరాబుడ్డిలో మంచి సిరా లేదు. |
| लक्ष्मी के माँ-बाप हमको जानते हैं। | లక్ష్మి తల్లిదండ్రులు మమ్ముల నెఱుంగుదురు. |
| वे रोज़ शाम को छः बजे समुद्र पर जाते हैं। | వారు నిత్యము సాయంకాలము 6 గంటలకు సముద్రమునకు వెళ్లెదరు. |
| आपकी गाय कितना दूध देती है ? | మీ యావు ఎన్ని పాలిచ్చు (చున్నది) ను ? |
| राधा क्लास में हमेशा हिन्दी बोलती है। | రాధ క్లాసులో ఎల్లప్పుడు హిందీ మాట్లాడుచున్నది. |
| तुम क्लास में क्यों हँसती हो ? | మీరు (స్త్రీ.) క్లాసులో ఎందుకు నవ్వుచున్నారు ? |
| राम की बहिन बहुत अच्छा खेलती है। | రాముని సోదరి చాల బాగుగ ఆడుచున్నది. |
| घर आओ और रुपये लाओ। | ఇంటికి వెళ్లండి మరియు రూపాయలు తీసికొనిరండి. |

* వర్తమానకాలరూపమే తద్ధర్మకమునందు వాడవచ్చును.

| | |
|---|---|
| मैं आपके भाई को बहुत दिनों से जानता हूँ। | నేను తమ సోదరుని చాలకాలమునుండి ఎఱుగుదును. |
| तुम यहाँ क्या सुनती हो? | మీరిక్కడ ఏమి వినుచూ ఉన్నారు? |
| आओ, घर चलें। | రండి. ఇంటికి పోవుదము. |
| वह बैल-गाड़ी में स्टेशन जाता है। | వారు ఎద్దు బండిలో స్టేషనుకు వెళ్లుతూ ఉన్నారు. |
| तुम रोज़ सुबह में वहाँ क्या करते हो? | మీరు ప్రతిరోజూ ఉదయమున అక్కడ ఏమి చేయుచున్నారు? |

---

## పాఠము 8.

### కొన్ని అవ్యయములు

| | |
|---|---|
| के ऊपर పైన | घर के ऊपर ఇంటిపైన |
| के नीचे క్రింద | मेज़ के नीचे మేజాబల్లక్రింద |
| के बाहर బైట, వెలుపల | घर के बाहर ఇంటి వెలుపల |
| के अन्दर లోపల | कमरे के अन्दर గదిలోపల |
| के पास వద్ద | मकान के पास ఇంటివద్ద |
| | मोहन के पास మోహనునివద్ద |
| के नज़दीक దగ్గర | पाठशाला के नज़दीक పాఠశాలదగ్గర |
| के पीछे వెనుక | घर के पीछे ఇంటి వెనుక |
| के साथ వెంట, తో, కూడ | आपके साथ తమవెంట |
| के बिना లేకుండా | घड़ी के बिना గడియారము లేకుండా |
| के बाद తరువాత | दो-बजे के बाद రెండుగంటల తరువాత |
| के पहले ముందు | नौ बजे के पहले తొమ్మిది గంటలకు ముందు |
| के सामने ఎదుట | मकान के सामने ఇంటి ఎదుట |
| के यहाँ వద్ద | नारायण के यहाँ నారాయణునివద్ద. |

**के सिवा** తప్ప, మినహా　　**आपके सिवा** తమరు మినహా
**के बारे में** గురించి　　**अध्यापक के बारे में** గురువుగారిని గురించి

13. నామవాచకములతో పైయవ్యయములకు ముందు '**के**' యను విభక్తిప్రత్యయ ముపయోగించుట గమనించుడు.

కాని ఈ క్రింది అవ్యయములకు మాత్రము **के** చేర్చుటకు బదులు **की** చేర్చెదరు.

**तरफ़, ओर** వైపు　　**तरह** వలె, మాదిరి
**अपेक्षा** కంటె　　**जगह** స్థానము
**नाईं** వలె　　**ख़ातिर** కొరకు, కోసము
**बदौलत** వల్ల　　**मारफ़त** ద్వారా

కొన్ని నామవాచకములు

**मन्दिर** దేవాలయము　　**तालाब** చెరువు
**बाज़ार** బజారు　　**दूकान** (స్త్రీ.) అంగడి
**गली** (స్త్రీ.) సందు　　**सड़क**, (స్త్రీ.) **रास्ता** దారి
**दफ़्तर** కార్యాలయము　　**कचहरी** (స్త్రీ.) కచ్చేరి

ఉదా :—**शहर की तरफ़** పట్టణము వైపు
**घर की ओर** ఇంటివైపు
**आप की तरह** తమవలె

వాక్యములు

| | |
|---|---|
| **सुब्बराव के घर के पास एक छोटा तालाब है।** | సుబ్బారావు ఇంటిదగ్గర ఒక చిన్న చెరువు ఉన్నది. |
| **कमला के पास आज एक भी रुपया नहीं है।** | కమలవద్ద నేడు ఒక రూపాయికూడ లేదు. |

| | |
|---|---|
| यह मकान सड़क के बहुत नज़दीक है। | ఈ ఇల్లు రోడ్డుకు జాల దగ్గరగా ఉన్నది. |
| वह किताब मेज़ के ऊपर है। | ఆ పుస్తకము బల్లమీద ఉన్నది. |
| तुम पेड़ के नीचे क्यों बैठते हो? | మీరు చెట్టుక్రింద ఎందుకు కూర్చును చున్నారు ? |
| देखो, मदरसे के बाहर कौन है? | చూడు, పాఠశాల బయట ఎవరు (ఏమనిషి) ఉన్నారు ? |
| वे कमरे के अन्दर क्या करते हैं? | వారు గదిలోపల ఏమి చేయుచున్నారు ? |
| आप रोज़ दो बजे के बाद यहाँ क्यों आते हैं? | తమరు ప్రతిదినము రెండు గంటలకు పిమ్మట ఇక్కడికి ఎందుకు వచ్చు చున్నారు ? |
| कृष्णा के घर के सामने एक बहुत बड़ा पेड़ है। | కృష్ణుని ఇంటి యెదుట చాల పెద్ద చెట్టు ఒకటి ఉన్నది. |
| रामराव आपके बिना नहीं खेलते। | రామారావు తమరు లేనిదే ఆడడు. |
| क्लास में राघवय्या हमेशा आगे रहता है। | క్లాసులో రాఘవయ్య ఎల్లప్పుడు ముందు ఉండును. |
| मुकुन्द रोज़ माधव के साथ दफ़्तर जाता है। | ముకుందుడు ప్రతిదినము మాధవునితో ఆఫీసుకు పోవుచున్నాడు. |
| हनुमन्तराव के घर के पास एक चौड़ी गली है। | హనుమంతరావు ఇంటివద్ద ఒక వెడల్పైన సందు గలదు. |
| मैं आपके बारे में बहुत नहीं जानता। | నేను తమరిని గురించి ఎక్కువ ఎఱుగను. |
| तुम गोपाल के यहाँ कितने बजे जाते हो? | మీరు గోపాలునివద్దకు (యింటికి) ఎన్ని గంటలకు వెళ్లెదరు ? |
| वे अभी दूकान की तरफ़ जाते हैं। | వారు ఇప్పుడే దుకాణమువైపునకు వెళ్లు చున్నారు. |

| | |
|---|---|
| आप यहाँ बैठिये, मैं अब बाहर जाती हूँ। | తమరు ఇక్కడ కూర్చొనుడు. నేను ఇప్పుడు వెలుపలకు వెళ్లుచున్నాను. |
| वह ठीक नारायण की तरह गाता है। | వాడు సరిగా నారాయణుని వలె పాడుచున్నాడు. |
| सामने देखो। | ఎదుటచూడు. |
| तुम आगे जाओ, मैं पीछे से आता हूँ। | మీరు ముందర వెళ్లండి. నేను వెనుక వచ్చెదను. |
| मैं अभी बाहर जा रहा हूँ। | నేను ఇప్పుడే బయటకు వెళ్లచూ ఉన్నాను. |
| नज़दीक आओ। | దగ్గరకు రమ్ము. |

---

## పాఠము 9.

### సర్వనామములు—వాని రూపములు

14. **मैं** అను సర్వనామమునకు ప్రత్యయము చేర్చినపుడు '**मुझ**' గా మారును. షష్ఠీవిభక్తిలో మాత్రము **मेरा, मेरे, मेरी** గను, చతుర్థీవిభక్తిలో **मेरे लिये, मेरे वास्ते** గను అగును. **हम** ప్రత్యయము చేర్చబడినపుడు ఏలాటి మార్పును చెందదు. కాని షష్ఠీవిభక్తిలో **हमारा, हमारे, हमारी** గను, చతుర్థీవిభక్తిలో **हमारे लिये, हमारे वास्ते** గను అగును.

| | |
|---|---|
| **मैं** నేను | **हम** మేము |
| **मुझको, मुझे** నన్ను, నాకు | **हमको, हमें** మమ్ము, మాకు |
| **मुझसे** నాచేత, నాతో | **हम से** మాచేత, మాతో |
| **मेरे लिये, मेरे, वास्ते** నాకొఱకు | **हमारे लिये, हमारे वास्ते** మాకొఱకు |
| **मेरा; मेरे, मेरी** నాయొక్క | **हमारा, हमारे, हमारी** మా యొక్క |
| **मुझमें** నాయందు | **हम में** మాయందు |
| **मुझ पर** నామీద | **हम पर** మామీద |

15. **मैं** వలెనే **तू** యున్ను ప్రత్యయములు చేర్చినపుడు **तुझ** గా మారును. షష్ఠీవిభక్తిలో **तेरा, तेरे, तेरी** గను, చతుర్థీవిభక్తిలో **तेरे लिये, तेरे वास्ते** గను అగును.

**तुम** ప్రత్యయము చేర్చినపుడు ఏలాటి మార్పును కెందదు. షష్ఠీ విభక్తియందు **तुम्हारा, तुम्हारे, तुम्हारी** గను, చతుర్థీయందు **तुम्हारे लिये, तुम्हारे वास्ते** గను అగును.

| | |
|---|---|
| **तू** నీవు | **तुम** మీరు |
| **तुझको, तुझे** నిన్ను. నీకు | **तुम को, तुम्हें** మిమ్ము. మీకు |
| **तुझसे** నీచేత. నీతో | **तुम से** మీచేత. మీతో |
| **तेरे लिये तेरे वास्ते** నీకొఱకు | **तुम्हारे लिये, तुम्हारे वास्ते** మీకొఱకు |
| **तेरा, तेरे, तेरी** నీయొక్క | **तुम्हारा, तुम्हारे, तुम्हारी** మీయొక్క |
| **तुझमें** నీయందు | **तुम में** మీయందు |
| **तुझ पर** నీ మీద | **तुम पर** మీ మీద |

సూచన :—ఉత్తమ మధ్యమ పురుష సర్వనామములకు షష్ఠీవిభక్తితో **का, के, की** లకు బదులు **रा, रे, री**లు క్రమముగ వ్రాయవచ్చునని గమనించునది.

సూచన :—**आप** అను సర్వనామము విభక్తి ప్రత్యయము చేర్చినపుడు మార్పుకెందదు.

ఉదా :—**आप से** తమచేత　　　　**आप का** తమయొక్క

నామవాచకములు

| | |
|---|---|
| **दोस्त, मित्र** స్నేహితుడు | **साथी** అనుచరుడు |
| **हाल, हालत** (స్త్రీ) స్థితి | **तबीयत** ఆరోగ్యము (స్త్రీ.) |
| **जवाब** జవాబు | **बात** మాట, సంగతి (స్త్రీ.) |
| **नाम** పేరు | **कीमत** (స్త్రీ.) వెల |
| **दुश्मन** శత్రువు | **खबर** సమాచారము |

క్రియలు

जान ఎరుగు

समझ తెలుసుకొను, అర్థము చేసుకొను

కొన్ని అవ్యయములు

कल నిన్న, రేపు

परसों మొన్న, ఎల్లుండి

आजकल ఈ రోజులలో, ప్రస్తుతము

अक्सर తఱచుగ

कम తక్కువ

ज्यादा అధికము

बस, काफ़ी చాలును

ठीक సరిగా

ही, सिर्फ़ మాత్రమే

थोड़ा కొంచెము, కొద్ది

कुछ కొంత, కొన్ని

बिलकुल బొత్తిగ

ख़ूब బాగుగ

| | |
|---|---|
| तुम्हारा नाम क्या है? | మీ పేరేమిటి? |
| मेरा नाम रामदास है। | నా పేరు రామదాసు. |
| आजकल तुम्हें कौन दूध देता है? | ప్రస్తుతము మీకు పాలు ఎవరు పోయుచున్నారు? |
| कल से लक्ष्मी मुझे दूध देती है। | నిన్నటినుండి లక్ష్మి నాకు పాలు పోయుచున్నది. |
| यह दूध तुम्हारे लिये काफ़ी है? | ఈ పాలు మీకు చాలునా? |
| हाँ, मेरे लिये यह काफ़ी है। | అవును, నాకివి చాలును. |
| आजकल तुम्हारी तबीयत कैसी है। | ప్రస్తుతము మీ ఆరోగ్యము ఎట్లున్నది. |
| कुछ दिन से मेरी तबीयत थोड़ी खराब है। | కొన్ని రోజులుగ నా ఆరోగ్యము కొంచెము చెడినది. |
| कल शाम स मेरे दोस्त की तबीयत भी ठीक नहीं है। | నిన్న సాయంత్రమునుండి నా స్నేహితుని ఆరోగ్యముగూడ బాగుగలేదు. |
| तुम अक्सर मुझसे रुपये क्यों लेते हो? | మీరు (తఱచుగా) మాటిమాటికి నావద్ద (నుంచి) రూపాయలేల తీసికొనుచున్నారు? |

| | |
|---|---|
| आजकल मेरे पास बिलकुल रुपये नहीं हैं। | ప్రస్తుతము నావద్ద బొత్తిగా రూపాయలు లేవు. |
| तुम्हारी किताब का क्या दाम है? | మీ పుస్తకము వెల ఎంత ? |
| मेरी किताब की कीमत बहुत ज़्यादा है। | నా పుస్తకము వెల చాల యధికము. |
| तुम मेरी बात बिलकुल नहीं समझते। | మీరు నా మాట బొత్తుగా తెలిసికొనుట లేదు (నేను చెప్పునది మీరు బొత్తుగా అర్థము చేసికొనుటలేదు). |
| मैं तुम्हें खूब जानता हूँ। | నేను మిమ్ములను బాగుగ ఎరుగుదును. |
| तुम मेरी बात का जवाब क्यों नहीं देते? | మీరు నా మాటకు జవాబు ఎందుకిచ్చుట లేదు ? |
| मेरे पास आज सिर्फ़ पाँच रुपये हैं। | నా వద్ద నేడు అయిదు రూపాయలు మాత్రమే ఉన్నవి. |
| तुम्हारे साथी की क्या खबर है? | మీ స్నేహితుని సంగతి ఏమిటి ? |
| बहुत दिन से मेरे साथी की कुछ भी खबर नहीं है? | చాల దినములనుండి నా స్నేహితునివద్ద నుండి విశేషములు ఏమీ లేవు. |
| अच्छा, अप बस कीजिये। | మంచిది, ఇంక చాలించండి. |
| वह बहुत कम काम करता है। | వాడు చాల తక్కువపని చేయుచున్నాడు. |

## పాఠము 10.

### సర్వనామములు—వాని రూపములు

16. वह, यह कौन, जो (ఎవడైతే), कोई (ఎవడైనా, ఎవడో) ఇవి విభక్తిప్రత్యయము చేర్చినపుడు క్రమముగ **उस, इस, किस, जिस, किसी** యగును.

(1) వీని బహువచన రూపములు క్రమముగ **उन, इन, किन, जिन, किन्हीं** యగును.

ఉదా :—**उसमें** దానియందు (**वह में** అనరాదు). **इस के लिये** దీనికొఱకు **किसमें** దేనిలో, ఎవనిలో **किसी से** ఎవనివలనైన, దేనివలనైన **उनको** వారిని. **किनपर** వేనిమీద, ఎవరిమీద.

17. సర్వనామములన్నిటియందున **कोई** అను దానికి తప్ప తక్కిన వానికన్నిటికిని ద్వితీయావిభక్తియందు రెండు రూపములు వచ్చును. అనగా ఏకవచనములలో **उसको-उसे, इसको-इसे, किसको-किसे, जिसको-जिसे, मुझको-मुझे, तुझको-तुझे** బహువచనములలో క్రమముగ **उनको, उन्हें, इनको-इन्हें, किनको-किन्हें, जिनको-जिन्हें, तुमको तुम्हें, हमको-हमें** పై రెండు రూపములను ఒకదానికి బదులు మరొకదానిని వాడవచ్చును. కాని రెండవరూపమునే తఱుచు వాడుదురు.

సూచన :—తెలుగు భాషలో షష్ఠీవిభక్తి ప్రత్యయములుగా వాడబడు కి, కు లకు బదులుగ హిందీయందలి ద్వితీయావిభక్తి రూపము '**को**' వాడవచ్చును.

ఉదా :—ఈ పుస్తకము వానికి ఇమ్ము **यह पुस्तक उसको (उसे) दो** మొ.

(2) '**क्या**' కు ప్రత్యయము చేర్చినపుడు '**काहे**' గా మారును. ఈ రూపము విశేషముగ వాడుక భాషలో నుపయోగింతురు. పుస్తక భాషలో అరుదు.

ఉదా :—**काहे को** లేక **काहे केलिये** దేనికొఱకు,_ దేనికి. **काहे में** దేనియందు, **काहे से** దేని (ఏకారణము) వలన. (దీనిని సాధారణముగ అప్రాణివాచకమున **कौन** కు బదులుగా వాడుదురు.

(3) తెలుగులోవలెనే హిందీలో **वह, यह, कौन, जो, कोई** దీని బహువచన రూపములను ఏకవచనములో మర్యాదకొరకు వాడుదురు.

ఉదా :—उनको వారిని, ఆయనను  इनसे వీరినుండి (ఈయననుండి)
किन के लिये ఎవరి కొఱకు  किन्हें ఎవరికి

నిజవాచక సర్వనామము **आप** తాను.

18. ఇది స్వ శబ్దమువంటిది. ఉత్తమ, మధ్యమ, ప్రథమ మూడు పురుషులలో రెండు వచనములయందును వచ్చును. (ప్రత్యయము చేర్చినపుడు యిది **अपने** అగును.) దీనిని ఏ నామవాచకముతో చేర్చిన దానియర్థమునే పొందును.

**आप** తాను  **आप को** తనను
**अपने से** తనలో, తనకంటె, తనవలన  **अपने लिये** తనకొఱకు
**अपना, अपने, अपनी** తనయొక్క  **अपने में** తనయందు
**अपने पर** తన మీద

ఉదా :—నేను నా ఇంటికి వెళ్లుచున్నాను **मैं मेरे घर जाता हूँ** అనుటకు బదులుగా **मैं अपने घर जाता हूँ** అని అనవలయును. మీరు మీ పాఠము చదవండి **तुम तुम्हारा पाठ पढ़ो** అనుటకు బదులుగా **तुम अपना पाठ पढ़ो** అని అనవలయును. వాడు తన పుస్తకము చదువుకొను చున్నాడు **वह उसकी किताब पढ़ता है** అనుటకు బదులుగా **वह अपनी किताब पढ़ता है** అని అనవలయును. వారు తమకొఱకు ఈ పనిని చేయుచున్నారు **वे उसके लिये यह काम करते हैं** అనుటకు బదులుగా **वे अपने लिये यह काम करते हैं** అని అనవలయును.

**खुद** స్వయముగ అనునదికూడ **आप** కు బదులు కేవలము ప్రథమా విభక్తియందు వాడుదురు.

ఉదా :— **मैं खुद वहाँ जाता हूँ** నేను స్వయముగ అక్కడకు వెళ్లు చున్నాను.

**सब** అన్నియు  **कई** కొన్ని, చాలా
**इतना** ఇంత  **उतना** అంత

| | |
|---|---|
| जब ఎప్పుడైతే | तब అప్పుడు |
| जितना ఎంతైతే | ऐसा ఇటువంటి |
| कितने ఎన్ని | बुरी तरह చెడు విధముగ |
| अच्छी तरह చక్కగ | तक వరకు |

క్రియలు

| | |
|---|---|
| चाह కోరు, కోరిక | पूछ అడుగు |
| बेच అమ్ము | खरीद కొను |
| भेज పంపు | सोच యోచించు |
| बुला పిలుచు | सिखा నేర్పు |
| प्यार कर ప్రేమించు | याद कर వల్లించు, స్మరించు |
| नाच నృత్యముచేయు, నృత్యము | बात चीत कर సంభాషించు |

| | |
|---|---|
| यह किसका घर है? | ఇది ఎవరి ఇల్లు? |
| यह उसके भाई का घर है। | ఇది వాని తమ్ముని యిల్లు. |
| इस घर में कौन रहता है? | ఈ యింట్లో ఎవరు నివసించుచున్నారు? |
| इस घर में आजकल कोई नहीं रहता। | ఈ యింట్లో ప్రస్తుతము ఎవరునూ ఉండుటలేదు. |
| तुम उसे क्यों बुलाते हो? | మీరు వానిని ఎందుకు పిలుచుచున్నారు. |
| उसकी एक किताब इनकी अलमारी में है। | వాని పుస్తకమొకటి వీరి అలమారులో నున్నది. |
| किसी का बुरा मत चाहो। | ఎవరి చెడుగును కోరవద్దు |
| मैं जब उनके घर जाती हूँ, तब वे मुझे एक किताब देते हैं। | నేను వారి యింటికి పోవునపుడు వారు నాకు ఒక పుస్తకము యిత్తురు. |
| जितना रुपया उनके पास है उतना किसी के पास नहीं है। | ఎంత ధనము ఆయన దగ్గరనున్నదో అంత ఎవరివద్దనులేదు (ఆయనవద్ద నున్నంతధనము ఎవరివద్దనూ లేదు.) |

| | |
|---|---|
| मैं कई दिनों से इनके घर में रहता हूँ। | నేను చాల రోజులుగ వీరి యింట నివసించుచున్నాను. |
| सब को प्यार करो। | ఎల్లరను ప్రేమింపుము. |
| उस तालाब के पास एक लड़की बहुत अच्छे फल बेचती है। | ఆ చెఱువువద్ద ఒక పిల్ల మంచి పండ్లు అమ్ముచున్నది. |
| इतना मीठा दूध तुम किससे ख़रीदते हो? | ఇంత తియ్యని పాలు మీరు ఎవరివద్ద కొనుచున్నారు? |
| ऐसा घर उस शहर में एक भी नहीं है। | ఇటువంటియిల్లు యీ పట్టణములో ఒకటికూడ లేదు. |
| यह चिट्ठी तुम किसे भेज रही हो? | ఈ జాబు మీరు ఎవరికి పంపుచూ ఉన్నారు. |
| मैं यह चिट्ठी तुम्हारे भाई के पास भेज रही हूँ। | నేను ఈ జాబు మీ సోదరునివద్దకు పంపుచూ ఉన్నాను. |
| परसों से मेरी बहन को कोई हिन्दी नहीं सिखाता। | మొన్నటినుండి మా చెల్లెలికి ఎవరును హిందీ నేర్పుట లేదు. |
| तुम यहाँ क्या सोच रहे हो? | మీరిక్కడ ఏమి యోచించుచూఉన్నారు? |
| जो पाठ तुम पढ़ते हो वह बहुत छोटा है। | మీరు చదువు పాఠము చాల చిన్నది. |
| वह ख़ुद वहाँ जा रहा है। | వాడు స్వయముగా అచ్చటికి పోవుచూ ఉన్నాడు. |
| आप ख़ुद यह काम कीजिये। | తమరు స్వయముగా యీ పనిచేయండి. |
| वह कभी अपनी दूकान पर नहीं बैठता है। | వాడు ఎప్పుడును తన దుకాణమువద్ద కూర్చుండుట లేదు. |
| वह अपने को सब से बड़ा समझता है। | వాడు తనను అందరికంటె పెద్ద అనుకొనుచున్నాడు. |
| तुम अपना काम अच्छी तरह नहीं करते। | మీరు మీ పనిని చక్కగా జేయుట లేదు. |

| | |
|---|---|
| यहाँ जितने आदमी रहते हैं मैं सबको जानता हूँ। | ఇక్కడ ఎందరు నివసించుచున్నారో అందరిని నేనెరుగుదును. |
| तुम क्यों उसके घर रोज़ जाते हो? | మీరు రోజు వాని యింటికి ఎందుకు పోయెదరు. |
| वह बहुत बुरी तरह गाता है। | వాడు చాల అసహ్యముగా పాడుచున్నాడు. |
| मैं दो बजे से पांच बजे तक उनके घर में रहता हूँ। | నేను రెండు గంటలనుండి అయిదు గంటలవరకు వారి ఇంటిలో ఉండుచున్నాను. |
| गोमती हमेशा हिन्दी में बातचीत करती है। | గోమతి ఎల్లప్పుడు హిందీలో మాట్లాడుచున్నది. |
| उसका नाम पूछो। | వాని పేరు అడుగుము. |

---

## పాఠము 11.

### భవిష్యత్కాలము

19. క్రియా పదమునకు ఏకవచనములో **एगा** బహువచనములో **एँगे** యు **मैं** కర్తగానున్న **ऊगा** యు **तुम** కర్తగానున్న **ओगे** చేర్చుట చేత భవిష్యత్కాల రూపము వచ్చును.

| ఏకవచనము | బహువచనము |
|---|---|
| मैं खाऊँगा నేను తినెదను | हम खाएँगे మేము తినెదము |
| तू खाएगा నీవు తినెదవు | तुम खाओगे మీరు తినెదరు<br>आप खाएँगे తమరు తినెదరు |
| वह खाएगा వాడు తినును | वे खाएँगे వారు తినెదరు, ఆయనతినును (మర్యాద) |

అజంత (అచ్చు అంతమందు గలవి) ధాతువులకు భవిష్యత్కాలములో **एगा, एगे** వీనికి బదులు **वेगा, यगा; वेंगे, यंगे,** అనియు **ऊगा, ओगे** వీనికి బదులు **वूगा, वोगे** యున్ను గూడ చేర్చవచ్చును.

| | | |
|---|---|---|
| ఉదా :—**जाएगा** కు బదులుగ | | **जायेगा, जायगा** |
| **जाएँगे** | .. | **जावेंगे, जायँगे** |
| **जाऊँगा** | .. | **जावूँगा** |
| **जाओगे** | .. | **जावोगे** |

20. హలంత ధాతువుల (హల్లు అంతమందు గలవి) భవిష్యత్కాల రూప మీక్రింది విధముగ నుండును:—

| | |
|---|---|
| **मैं करूँगा** నేను చేయుదును | **हम करेंगे** మేము చేయుదుము |
| **तू करेगा** నీవు చేయుదువు | **तुम करोगे** మీరు చేయుదురు<br>**आप करेंगे** తమరు చేయుదురు |
| **वह करेगा** వాడు జేయును | **वे करेंगे** వారు చేయుదురు |

**ले, दे, हो** ధాతువుల రూపములిట్లుండును.

| | |
|---|---|
| **मैं लूँगा** నేను తీసికొందును | **हम लेंगे** మేము తీసికొనెదము |
| **तू लेगा** నీవు తీసుకొనెదవు | **तुम लोगे** మీరు తీసికొనెదరు<br>**आप लेंगे** తమరు తీసికొనెదరు |
| **वह लेगा** వాడు తీసికొనును | **वे लेंगे** వారు తీసికొనెదరు |

21. స్త్రీలింగ శబ్దములు కర్తగానున్నప్పుడు అంత్యాక్షరములకు **गा। गे** లు **गी**గా మారును (**आ, ए, ई**) నియమము చూడుడు.

| | |
|---|---|
| **मैं करूँगी** నేను చేయుదును | **हम करेंगी** మేము చేయుదుము |
| **तू करेगी** నీవు చూయుదువు | **तुम करोगी** మీరు చేయుదురు<br>**आप करेंगी** తమరు చేయుదురు |
| **वह करेगी** ఆమె చేయును | **वे करेंगी** వారు చేయుదురు |

క్రియల అవ్యయములు

| | |
|---|---|
| मिल కలియు. దొరకు | कह చెప్పు |
| सांफ़ कर శుభ్రపరచు | विचार कर ఆలోచించు |
| नहा స్నానముచేయు | धो కడుగు; ఉతుకు |
| और ఇంక. ఇతరము | ज़रूर తప్పక |
| जल्दी త్వరగా | धीरे धीरे మెల్లగా |
| देर ఆలస్యము (కాలము) (స్త్రీ.) | देर से ఆలస్యముగా |
| क़रीब దాదాపు | ज़रा కొంచెము |

लोग మంది. మనుష్యులు

| | |
|---|---|
| भैया, तुम आज शाम को क्या करोगे ? | సోదరా. నీవు నేడు సాయంకాలము ఏమి చేసెదవు ? |
| मैं आज नारायण के घर जाऊँगा। | నేను నేడు నారాయణుని యింటికి వెళ్లెదను. |
| वहाँ आज क्या है, वहाँ क्यों जाओगे? | అక్కడ నేడేమి, అక్కడకు ఎందుకు పోయెదవు ? |
| आज नारायण की बहिन गायगी। | నేడు నారాయణుని చెల్లెలు పాడును. |
| वह बहुत अच्छा गाती है ? | ఆమె చాల బాగుగా పాడునా ? |
| हाँ, तुम भी चलोगी ? | అవును, నీవుగూడ వచ్చెదవా ? |
| हाँ, मैं ज़रूर चलूँगी, हमारे साथ और कौन कौन चलेंगे। | అవును, నేను తప్పక వచ్చెదను, మన వెంట యింకను ఎవరెవరువచ్చెదరు? |
| नहीं, और कोई नहीं चलेगा, सिर्फ़ मैं और तुम चलेंगे। | లేదు, మఱియెవ్వరును రారు నీవు నేను మాత్రమే వెళ్లదము. |
| आप यह किताब खरीदेंगे ? | తమరు యీ పుస్తకము కొనెదరా ? |
| नहीं, यह किताब ऐसी अच्छी नहीं है, इसलिये मैं नहीं खरीदूँगा। | లేదు, ఈ పుస్తకమంత మంచిదికాదు, కాబట్టి నేను దీనిని కొనను. |

| | |
|---|---|
| तुम उनसे कब मिलोगे ? | మీరు ఆయనను ఎప్పుడు కలిసెదరు (చూచెదరు) |
| मैं आज थोड़ी देर में उनसे उनके घर पर मिलूँगा। | నేడునేను కొంచెము సేపటిలో ఆయనను ఆయన యింటివద్దనే చూచెదను. |
| वह मुझे बहुत प्यार करेगी ? | ఆమె నన్ను మిగుల ప్రేమించునా ? |
| वे हमसे यह बात नहीं कहेंगे। | వారు మనతో యీ మాట చెప్పరు. |
| आज कमरा कौन साफ़ करेगा ? | నేడు గది నెవరు శుభ్రపరచెదరు ? |
| वह कभी उस आदमी के साथ बातचीत नहीं करेगा। | వాడెప్పుడును ఆ మనుష్యునితో మాట్లాడడు. |
| तुम जल्दी जाओ, मैं आज देर से आऊँगा। | మీరు త్వరగా వెళ్లుడు. నేను నేడు ఆలస్యముగా వచ్చెదను. |
| जल्दी करो, थोड़ी देर में दस बजेंगे। | త్వరగా కానిమ్ము. కొలది సేపటిలో పది కొట్టును. |
| मैं आज नहीं नहाऊँगा। | నేను నేడు స్నానము చేయను. |
| करीब दो घंटे में वे यहाँ अपने भाई के साथ आयँगे। | సుమారు రెండుగంటలలో వారు తమ సోదరునితో ఇక్కడకు వచ్చెదరు. |
| वह मेरी बात जरा भी नहीं सुनेगा। | వాడు నామాట కొంచమైనమూ వినడు. |
| तुम इतना धीरे धीरे क्यों बोलते हो ? | నీవు ఇంత మెల్లగా ఎందుకు మాట్లాడుచున్నావు ? |
| तुम खुद विचार करो और देखो यह कहाँ तक ठीक है। | ఇది ఎంతవరకు సరియైనదో నీవు స్వయముగ ఆలోచించి చూడుము. |
| मैं और पांच रुपये तुमको दूँगा। | నేను ఇంకా అయిదు రూపాయిలు మీకు ఇచ్చెదను. |
| मैं दो दिन और यहाँ ठहरूँगा। | నేను రెండు దినములు ఇంకా ఇక్కడ ఆగుదును. |
| और लोग इसे नहीं चाहेंगे। | ఇతరులు దీనిని కోరరు. |

## పాఠము 12.

### భావార్థకము

22. (आ) ధాతువునకు చివర "**ना**" చేర్చిన తెలుగులో "ట" చేర్చినట్లగును, దీనినే భావార్థక క్రియలందురు.

ఉదా :—**खा** తిను. **खाना** తినుట. **पढ़** చదువు. **पढ़ना** చదువుట. **देख** చూడు. **देखना** చూచుట మొ.

23. (आ) భావార్థకమును రెండు విధములుగ నుపయోగింతురు.

1. విధ్యర్థకము, 2. క్రియార్థక సంజ్ఞ (నామవాచకము).

(1) విధ్యర్థకమునందు అది ఎప్పుడూ భవిష్యదర్థమునే సూచించును.

ఉదా :—**तुम यह काम मत करना** మీరీపని చేయరాదు.

**वहाँ कभी मत जाना** మీరక్కడికి ఎపుడును పోవద్దు.

(2) క్రియావాచకములు ఎల్లప్పుడు పుంలింగములుగనే వాడబడును—(ఇది క్రియరైనను నామవాచకమువలె వాడబడుచున్నది గావున దీనికీ పేరు వచ్చెను.)

ఉదా :—**देर से जागना बुरा है** అలస్యముగ మేల్కొనుట చెడుగు.

**क्या उसका आना ज़रूरी है?** వాడు వచ్చుట యవసరమా?

24. (इ) భావార్థకములోని కడపటి '**ना**' ప్రత్యయము వచ్చినపుడు "**ने**" యగును.

ఉదా :—**वह पढ़ने के लिये यहाँ आता है** వాడు చదువుకొనుటకు యిచ్చటికి వచ్చును.

**खूब पढ़ने से परीक्षा में पास होगे** బాగుగా చదువుకొనుటవలన పరీక్షలో నెగ్గెదవు.

**वहाँ जाने में देर मत करो** అక్కడికి పోవుటలో ఆలసించవలదు.

సూచన :—క్రియార్థక సంజ్ఞలో వచ్చు చతుర్థీవిభక్తిప్రత్యయమగు के लिये ఒక్కొక్కప్పుడు వదలివేయబడును.

ఉదా :—मैं खाने जाता हूँ }
खाने के लिये जाता हूँ } నేను భోజనము చేయుటకు వెళ్లుచున్నాను.

ఇట్లే అన్నియు నెరుగవలెను.

కొన్ని నామవాచకములు

आँख కన్ను (స్త్రీ.)
बाल వెండ్రుకలు
सूरज సూర్యుడు
छुट्टी సెలవు (స్త్రీ.)
वक़्त, समय సమయము

कान చెవి
शरीर, बदन శరీరము
चाँद చంద్రుడు
चीज़ వస్తువు (స్త్రీ.)
बार పర్యాయము, దఫా (స్త్రీ.)

సముచ్చయములు

और, व మరియు
लेकिन, पर కాని
क्योंकि ఎందుకనగా
इसलिये కాబట్టి

या, वा లేక
अगर, यदि అయితే, అయినచో
कि అని, ఏమనగా
तो भी అయినను

కొన్ని విశేషణములు

ठंडा చల్లని
तेज़ చురుకైన, పదునైన
मुलायम మృదువైన
ख़ूबसूरत, सुंदर అందమైన
आसान సులభమైన
ताज़ा తాజా, నవీనమైన (అప్పుడు తయారైన)

गरम వేడియైన
सुस्त సోమరియైన
कड़ा, सख़्त గట్టి
उमदा శ్రేష్ఠమైన
बेवक़ूफ़ మూర్ఖుడు, తెలివిలేనివాడు
मुश्किल కఠినమైన
अकलमंद బుద్ధిమంతుడు

| | |
|---|---|
| कल छुट्टी है, इसलिये तुम स्कूल मत जाना। | రేపు సెలవు. కావున మీరు బడికి పోవద్దు. |
| ताजे फल खाना अच्छा है। | అప్పుడు కోసిన పండ్లు తినుట మంచిది. |
| हमारी आँखें देखने के लिये और कान सुनने के लिये हैं। | మన కండ్లు చూచుటకును. చెవులు వినుటకును అయియున్నవి. |
| सूरज निकलने में अभी देर है। | సూర్యుడు ఉదయించుటకు ఇంకను ఆలస్యము ఉన్నది. |
| जल्दी उठो, यह सोने का वक़्त (समय) नहीं है। | త్వరగా లెమ్ము. ఇది నిద్రించు సమయము కాదు. |
| ठंडे पानी से नहाना शरीर के लिए बहुत अच्छा है। | చన్నీళ్లలో స్నానము చేయుట శరీరమునకు చాలా మంచిది. |
| यह काम करना उनके लिए बहुत मुश्किल नहीं है। | ఈ పని చేయుట ఆయనకు ఎక్కువ కష్టముకాదు (ఈ పని ఆయనకు అంత కష్టమైనదిగాదు). |
| यह उनके लिये बहुत आसान है। | ఇది అతనికి చాల సులభము. |
| किसी काम को मुश्किल मत समझो। | ఏ పనిని కష్టమని ఎంచవద్దు. |
| उसका लड़का पढ़ने-लिखने में बड़ा तेज़ है। | ఆయన పిల్లవాడు (కుమారుడు) చదువుట వ్రాయుటయందు చాల చురుకైనవాడు. |
| उसके बाल बहुत मुलायम और लंबे हैं। | ఆమె వెండ్రుకలు మృదువుగను చాల పొడవుగను ఉన్నవి. |
| कल से वे दफ़्तर नहीं जाते, क्योंकि उनकी तबीयत अच्छी नहीं है। | నిన్నటినుండి ఆయన కచ్చేరికి వెళ్లుట లేదు. ఎందుకనగా ఆయన ఆరోగ్యము బాగుగ లేదు. |

| | |
|---|---|
| तुम रोज़ दो बार मेरे घर के पास आते हो, लेकिन मुझसे एक बार भी नहीं मिलते। | మీరు ప్రతిదినము రెండు పర్యాయములు మాయింటి వద్దకు వచ్చెదరు కాని నన్ను ఒకసారికూడ కలియరు. |
| राम कहता है कि उसकी बहन बड़ी अक़्लमन्द है। | రాముడు చెప్పుచున్నాడు తన చెల్లెలు చాల తెలివిగలది అని (రాముడు తన చెల్లెలు చాల తెలిగలదని చెప్పుచున్నాడు). |
| उनका कहना है कि बाज़ार की किसी दूकान में यह चीज़ नहीं है। | వారు చెప్పునదేమంటే బజారులో ఏ దుకాణములోను యీ వస్తువు చిక్కదట. |
| वह बेवक़ूफ़ है, तो भी इस बात को अच्छी तरह समझता है। | వాడు తెలివి తక్కువవాడు (మూర్ఖుడు) అయినప్పటికిని యీ సంగతి బాగుగ తెలిసికొనును. |
| अगर तुम अभी वहाँ जाओगे तो वे तुमसे ज़रूर मिलेंगे। | మీరు ఇప్పుడే అక్కడికి వెళ్లినచోవారు మిమ్ములను తప్పక కలిసికొందురు. |
| मैं अपना पाठ रोज़ याद करता हूँ, इसलिए उस्ताद मुझे प्यार करते हैं। | నేను నా పాఠమును ప్రతిరోజు వల్లించెదను. అందువలన గురువుగారు నన్ను ప్రేమించుచున్నారు. |
| यह लड़का बड़ा सुस्त है, यह कभी अपना काम नहीं करता। | ఈ బాలుడు చాల సోమరి. వీడు ఎప్పుడును తన పని చేసికొనడు. |
| यह कपड़ा बहुत उमदा है, तुम इसे अपने साथ रखो। | ఈ వస్త్రము చాల అందముగానున్నది. మీరు దీనిని మీతోకూడ (వద్ద) నుంచుకొనుడు. |
| यह तस्वीर बड़ी ख़ूबसूरत है। | ఈ పటము చాల అందమైనది. |
| तुम बड़ी कड़ी बातें कहते हो। | మీరు చాలా కటువచనములు పలుకుచున్నారు. |

| | |
|---|---|
| तुम इस छुट्टी में बंगलोर जाओगे या मद्रास में रहोगे ? | మీరు యీ సెలవులలో బెంగళూరు వెళ్లెదరా లేక మద్రాసులో నుందురా ? |
| मैं कुछ दिन मद्रास में रहूँगा। और कुछ दिनों के लिए ऊटी जाऊँगा। | నేను మద్రాసులో కొన్ని దినములుందును కొన్ని రోజులు (ఉండుటకొఱకు) ఊటీ వెళ్లెదను. |
| वह आदमी देखने में बड़ा ख़ूबसूरत है पर उसमें विद्या नहीं है। | ఆ మనుష్యుఁడు చూచుటకు చాలా అందముగా నున్నాడు కాని అతనిలో విద్య లేదు. |
| मैं अक्सर अपने दोस्तों से मिलने वहाँ जाता हूँ। | నేను తఱచుగా నా మిత్రులను కలియుటకై అక్కడికి వెళ్లెదను. |
| तुम मेरे आने तक यहाँ ठहरो। | నేను వచ్చువరకు మీరిక్కడ ఉండుడు. |
| एक प्याला गरम चाय लाओ। | ఒక కప్పు వేడి తేనీరు తెండు. |

---

## పాఠము 13.

### లింగము—వచనము

### లింగము

25. పుంలింగ స్త్రీలింగములు తెలుగులోవలెనే హిందీలో గూడ పురుష స్త్రీజాతి ప్రాణుల ననుసరించియుండును. హిందీలో నపుంసక లింగము లేదు.

26. ప్రాణివాచకములయొక్క లింగ నిర్ణయము సులభము. తెలుగులోని ప్రాణివాచకము లైన నపుంసకలింగములు కొన్ని పుంలింగములుగను, మరికొన్ని స్త్రీలింగములుగను హిందీలో వాడబడుచున్నవి. లింగభేదమును తెలుసుకొనుటకు నియమములు అధికముగా హిందీయందు లేవు. అభ్యాసము వల్లనే శబ్దములయొక్క లింగములను ఎరుగవలెను. అయినను యీ క్రింది నియమములు కొంతవరకు అట్టి విభజనకు తోడ్పడగలవు.

(అ) హలంతములును, ఆకారాంతములును నగు అప్రాణివాచక హిందీ శబ్దములు సాధారణముగ పుంలింగములుగ పరిగణింపబడుచున్నవి.

ఉదా :—फल పండు घर ఇల్లు

कमरा గది रास्ता త్రోవ

సూచన :—ఈ పై నియమ మెల్లచోట్ల నుపయోగపడదు. కావున ఒక శబ్దముయొక్క లింగమును తెలుసుకొన గోరినపుడు దాని వెనుకనుండు విశేషణమునుబట్టిగాని, అట్టి శబ్దమున్న వాక్యమునందలి క్రియనుబట్టిగాని నిర్ణయించుకొవలెను.

(ఆ) 'ि' కార 'ी' కారాంతములగు నప్రాణివాచక శబ్దములు సాధారణముగా స్త్రీలింగములగును.

ఉదా :—कुर्सी కుర్చీ. पानी నీరు. दही పెరుగు. घी నెయ్యి. मोती ముత్తెము. जी హృదయము అను శబ్దములు మాత్రము పుంలింగములు.

సూచన :—శబ్దముయొక్క లింగమును నిర్ణయించుటకు పూర్తియైన నియమము లిచ్చుట కష్టము. పాఠకులు నియమముల ద్వారా లింగమును తెలుసుకొనుటకు ప్రయత్నింపక తమ అభ్యాసముమీదనే ఆధారపడియుండుట లాభకరము. పుల్లింగ శబ్దములకు స్త్రీలింగ రూపములు తత్సంబంధమయిన కొన్ని విషయములను ఈ పుస్తకము చివర ఒకటవ యనుబంధములో చూడుడు.

27. అప్రాణివాచక శబ్దముయొక్క లింగము తెలియనపుడు దానిని పుంలింగముగా వాడుట మంచిది.

## వచనము

28. తెలుగులోవలెనే హిందీలోను వచనములు రెండు :—

(1) ఏకవచనము (2) బహువచనము

(29) ఏకవచన శబ్దమును బహువచనముగా మార్చుటకు నియమములు.

1. పుంలింగ శబ్దములు आ కారాంతములుగనున్నపుడు తప్ప మరి ఏ అచ్చు అంతమందున్నను మార్పు జెందవు.

ఉదా :—घर ఇల్లు, ఇండ్లు (చూ. నియ. 2)

సూచన :—రెండు వచనములలోను శబ్దరూపము ఒకే విధముగ నుండును .గాని క్రియనుబట్టిగాని దాని విశేషణమును బట్టిగాని వచనము తెలిసికొనవగును.

2. आ కారాంత పుంలింగ ఏకవచన శబ్దముల కడపట 'आ' ను 'ए' గా నొనర్చిన బహువచనములగును.

| | |
|---|---|
| ఉదా :—लड़का బాలుడు | लड़के బాలురు |
| घोड़ा గుఱ్ఱము | घोड़े గుఱ్ఱములు |

3. హలంతములగు స్త్రీలింగ ఏకవచన శబ్దములకు అనునాసిక ఏత్వము "एँ" చేర్చిన బహువచనములగును.

| | |
|---|---|
| ఉదా :—पुस्तक పుస్తకము | पुस्तक పుస్తకములు |
| आँख కన్ను | आँखें కండ్లు |

4. 'इ' కారాంతములగు స్త్రీలింగ ఏకవచన శబ్దములకు చివర याँ కూర్చిన బహువచనములగును.

| | |
|---|---|
| ఉదా :—तिथि తిథి, తేది | तिथियां తిథులు, తేదీలు |

(5) 'ई' కారాంత స్త్రీలింగ ఏకవచన శబ్దముల కడపట 'ई' ని 'इ' చేసి పిదప याँ చేర్చిన బహువచనములగును.

| | |
|---|---|
| ఉదా :—लड़की బాలిక | लड़कियाँ బాలికలు |
| नदी నది | नदियाँ నదులు |

6. (పై చెప్పినవిగాక) అచ్చులు కడపటగల స్త్రీలింగ ఏకవచన శబ్దములకన్నిటికిని एँ గాని यं గాని చేర్చిన బహువచనములగును.

ఉదా :—माता తల్లి — माताएँ, माताये తల్లులు
दवा మందు — दवायें మందులు
वस्तु వస్తువు — वस्तुएँ, वस्तुयें వస్తువులు

సూచన :—సాధారణముగా మొదటి రూపము అనగా एँ నే వాడుదురు.

30. (అ) నామవాచకములయొక్క బహువచన రూపమునకు విభక్తి ప్రత్యయము చేర్చవలసినపుడు ఏకవచన రూపమునకు ओं చేర్చి పిదప విభక్తి ప్రత్యయములు చేర్చుకొనవలెను.

ఉదా :—घर ఇల్లు — घरों में ఇండ్లలో
लड़का బాలుడు — लड़कों का బాలుర యొక్క
पुस्तक పుస్తకము — पुस्तकों से పుస్తకములనుండి

(ఆ) 'इ' కార 'ई' కారాంతములగు నామవాచక శబ్దములకు బహువచనములో ప్రత్యయము చేర్చవలసినచో ओं కు బదులు यों చేర్చవలెను.

ఉదా :—स्त्री - स्त्रियों से, भाई - भाईयों से ।

(ఇ) సంబోధనాత్మక బహువచనము నామవాచకమునకు ओ చేర్చిన ఏర్పడును.

ఉదా :—भाई - भाइयो, लड़के - लड़को ।

31. తెలుగులోవలెనే హిందీలోగూడ మర్యాదకుగాను तुम మీరు आप తమరు, वे వారు, ये వీరు, వీనిని ఏకవచనమునందుగూడ నుపయోగించె దరు. సంభాషణలో 'मैं' కి బదులు 'हम' ఉపయోగించుట హిందీలోని విశేషము (తెలుగులో మా యూరు. మా తమ్ముళ్లు అన్నట్లు). (हम लोग, आप लोग)

బహువచనములో వాడవలసినపుడు लोग చేర్చెదరు.

## పాఠము 14.

| | |
|---|---|
| वर्ष, साल సంవత్సరము | महीना, मास మాసము |
| जगह (स्त्री.) స్థలము | किनारा ఒడ్డు |
| किराया బాడుగ | बिजली की गाड़ी ట్రాంబండి |
| बढ़िया శ్రేష్ఠమైన, మంచి | अकेले ఒంటరిగ |
| कम से कम కనీసము | लायक़ యోగ్యమైన |
| होकर గుండా (via) | अच्छा మంచిది, సరే |
| लग పట్టు, ఖర్చుఅగు | ठहर ఆగు |
| पहुँच చేరు | निकल బయలుదేరు |
| रवाना हो బయలుదేరు | बस చాలును |
| बाजा మేళములు | बजा మ్రోగించు |

| | |
|---|---|
| आजकल आप कहाँ रहते हैं ? | ప్రస్తుతము మీరు యెక్కడ ఉంటున్నారు ? |
| मैं दो वर्ष से काशी में रहता हूँ। | నేను రెండు సంవత్సరములనుండి కాశీలో ఉంటున్నాను. |
| काशी कैसी जगह है ? | కాశీ యెట్టి ప్రదేశము ? |
| काशी गंगा नदी के किनारे पर एक बहुत बढ़िया शहर है। | కాశీ గంగ యొడ్డున ఒక గొప్ప మంచి పట్టణము. |
| यहाँ से काशी जाने का रस्ता किधर से है ? | ఇక్కడినుండి కాశికి వెళ్ల మార్గము ఎటువైపున్నది ? |
| यहाँ से कलकत्ता या बल्लारशाह होकर हम वहाँ जाते हैं ? | ఇక్కడినుండి కలకత్తా లేక బాల్లార్‌షా మార్గముగా మనము అక్కడికి పోయెదము. |
| वहाँ पहुँचने में कितने दिन लगते हैं और वहाँ तक का किराया क्या है ? | అక్కడికి చేరుటలో (కు) ఎన్ని దినములు పట్టును (మరియు) అచ్చటికి బాడుగ ఏమి (ఎంత) ? |

| | |
|---|---|
| यहाँ से काशी पहुँचने में तीन दिन लगते हैं और मद्रास से वहाँ तक का किराया क़रीब तीस रुपया है। | ఇక్కడనుండి కాశీకి చేరుటకు మూడు రోజులు పట్టును మరియు మద్రాసు నుండి అచ్చటికి బాడుగ దాదాపు ముప్పది రూపాయలు (అగును.) |
| आप फिर काशी के लिए कब निकलेंगे? | మీరు తిరిగి కాశీకి ఎప్పుడు బయలుదేరెదరు. |
| मैं दस दिन में निकलूँगा। | నేను పది రోజులలో బయలుదేరెదను. |
| अच्छा, इस बार मैं भी आपके साथ चलूँगा, मैं काशी में कुछ दिन रहना चाहता हूँ। | మంచిది, ఈ సారి నేనుకూడ మీ వెంట వచ్చెదను. నేను కాశీలో కొన్ని రోజులుండ గోరుచున్నాను. |
| तुम अकेले चलोगे या तुम्हारे साथ तुम्हारे माँ और बाप भी आवेंगे? | మీరు ఒంటరిగా (ఒకరే) వచ్చెదరా లేక మీ వెంట మీ తలిదండ్రులు కూడ వచ్చెదరా? |
| पिताजी के बारे में मैं नहीं जानता; लेकिन माँ ज़रूर मेरे साथ आयँगी, मैं अकेले वहाँ नहीं जाना चाहता। | తండ్రిగారి విషయము (లో) నే నెరుగను కాని తల్లిగారు తప్పకనావెంట వచ్చెదరు, నేను ఒంటరిగా అక్కడికి పోదలచుకొనలేదు. |
| तुम काशी में कितने दिन ठहरोगे? | మీరు కాశీలో నెన్ని రోజులుందురు? |
| अभी कुछ निश्चित नहीं है; लेकिन मैं सोचता हूँ कि कम से कम दो महीने वहाँ ज़रूर ठहरूँगा। | ఇంకను ఏమియు సరి (నిర్ణయము) కాలేదు, కాని కనీసము రెండు నెలలు తప్పక ఉందునని తలంచుచున్నాను. |
| काशी में और काशी के नज़दीक क्या-क्या चीज़ें और जगहें देखने लायक हैं? | కాశీలోను కాశీ దగ్గరను ఏయేవస్తువులు ఏయే స్థలములు చూడదగినవై యున్నవి? |

| | |
|---|---|
| काशी में विश्वनाथजी का मंदिर, हिन्दू-विश्व-विद्यालय और गंगा का किनारा देखने लायक हैं। | కాశీలో విశ్వనాథుని దేవాలయము, హిందూవిశ్వవిద్యాలయము మఱియు గంగాతీరము చూడదగినవి. |
| काशी से थोड़ी दूर सारनाथ का मंदिर है। | కాశీనుండి కొలది దూరములో సారనాథుని దేవాలయమున్నది. |
| क्या काशी में बिजली की गाड़ियाँ भी हैं? | కాశీలో ట్రాంబండ్లుగూడ నున్నవా? |
| नहीं, वहाँ बिजली की गाड़ियाँ नहीं हैं, लेकिन घोड़ा-गाड़ियाँ मिलती हैं। | లేదు, అక్కడ ట్రాంబండ్లు లేవు కాని గుఱ్ఱపు బండ్లు దొరకును. |
| रघुनाथराव की दो लड़कियाँ काशी में संस्कृत और अंग्रेज़ी पढ़ती हैं। | రఘునాథరావుగారి బాలికలిద్దరు కాశీలో సంస్కృతము యింగ్లీషు చదువుచున్నారు. |
| लड़कियों के पिता भी वहीं रहते हैं। | బాలికల తండ్రి గూడ అక్కడనే ఉంటున్నారు. |
| वे लोग गंगा के किनारे एक बड़े सुन्दर मकान में रहते हैं। | వారు గంగ ఒడ్డున ఒక సుందరమైన భవనములో నుంటున్నారు. |
| वे दो महीने में मद्रास आयँगे। | వారు రెండు నెలలలో మద్రాసు వచ్చెదరు. |
| कौन बाजा बजा रहा है? | ఎవరు మేళము వాయించుచూ ఉన్నారు? |

## పాఠము 15.

### భూ త కా ల ము

### సామాన్య భూతకాలము

32. (అ) క్రియాపదమునకు చివర "**आ**" గాని "**या**" గాని చేర్చుటచే భూతకాలిక క్రియారూప మేర్పడును.

(ఆ) హలంతమగు ధాతువునకు చివర '**आ**' చేర్చినచో భూతకాలమేర్పడును.

ఉదా :—**पढ़** చదువు. **पढ़ा** చదివెను. **लिख** వ్రాయు. **लिखा** వ్రాసెను. **बोल** మాట్లాడు. **बोला** మాట్లాడెను.

(ఇ) '**आ**' కార '**ओ**' కార '**ए**' కారాంతములగు ధాతువులకు చివర '**या**' చేర్చిన భూతకాల మేర్పడును.

ఉదా :—**आ** వచ్చు. **आया** వచ్చెను. **ला** తెచ్చు. **लाया** తెచ్చెను. **सो** నిద్రించు. **सोया** నిద్రించెను. **धो** ఉతుకు. **धोया** ఉతికెను. **खे** పడవ నడుపు. **खेया** పడవ నడిపెను. **से** గ్రుడ్లు పొదుగు. **सेया** పొదిగెను.

ధాతువు చివర '**ई**' కారమున్నచో దానిని హ్రస్వము చేసిన పిదప '**या**' చేర్చిన భూతకాలమగును.

ఉదా :—**पी** త్రాగు. **पिया** త్రాగెను. **सी** కుట్టు. **सिया** కుట్టెను.

ఈ క్రింది క్రియలు మాత్రము పై నియమములకు లోబడక భూతకాలములో నిట్లు మార్పుచెందును.

ఉదా :—**कर** చేయు. **किया** చేసెను.
**जा** వెళ్లు. **गया** వెళ్లెను.
**ले** తీసికొను. **लिया** తీసికొనెను.

हो అగు. हुआ అయ్యెను.

दे ఇచ్చు. दिया ఇచ్చెను.

(ఊ) క్రియ చివరను 'ऊ' యున్నచో దానిని 'उ' చేసి 'आ' చేర్చవలెను.

ఉదా :—छू తాకు. छुआ తాకెను.

(ఋ) పై నియమములలో చెప్పబడినవన్నియు పుంలింగ ఏకవచన రూపములు.

33. (అ) పై రూపములను (భూతకాల క్రియారూపములను) **आ, ए, ई** నియమము ననుసరించి మార్చినచో పుంలింగ బహువచనము స్త్రీలింగ ఏకవచనము నేర్పడును.

ఉదా :—पढ़ा-पढ़े-पढ़ी, खाया-खाये-खायी, गया-गये-गयी, सोया-सोये-सोयी మొ.

(ఆ) **पिया, दिया, लिया, किया** వీని స్త్రీలింగ ఏకవచన రూపములు క్రమముగ **पी, दी, ली, की** అగును.

(ఇ) స్త్రీలింగ ఏకవచన రూపమునకు పైన (ं) అనుస్వారము నుపయోగించి (ముక్కుతో నుచ్చరించి) నచో స్త్రీలింగ బహువచనరూపము లేర్పడును.

ఉదా :—

| స్త్రీ. ఏ. | స్త్రీ. బ. |
|---|---|
| खायी | खायीं |
| गयी | गयीं |
| सोयी | सोयीं |

34. అకర్మక క్రియయొక్క లింగవచనములు కర్త ననుసరించి యుండును.

ఉదా :—मैं सोया, हम सोये, राधा सोयी ।

సూచన :—ला తీసికొనివచ్చు. बोल మాట్లాడు. भूल మరచిపోవు ఈ క్రియలు అకర్మకములుగ పరిగణింపబడును.

ఉదా :—मैं लाया నేను తెచ్చితిని.

वह बोला వాడు మాట్లాడెను.

तुम भूले మీరు మరచితిరి.

**पकड़** పట్టుకొను
**था** (పుం. ఏకవచనము.) ఉండెను
**थी** (స్త్రీ. ,, ) ,,
**दोस्त** స్నేహితుడు
**सभा** (స్త్రీ.) సభ
**इनाम** బహుమతి
**समझ** తెలుసుకొను, తెలివి
**शायद** బహుశా
**पर** కాని

**बना** తయారుచేయు, నిర్మించు
**थे** (పుం. బహువచనము.) ఉండిరి
**थीं** (స్త్రీ. ,, ) ,,
**अदालत** (స్త్రీ.) న్యాయాలయము
**लाभ** లాభము
**लेख** వ్యాసము
**सबेरा** ప్రాతఃకాలము
**कभी** ఎప్పుడైనా, ఎప్పుడును
**तक** వరకు

**पा** పొందు

| | |
|---|---|
| आज तुमने क्या खाया ? | నేడు మీరేమి తిన్నారు ? |
| मैंने आज भात खाया। | నేడు నేను అన్నము తిన్నాను. |
| तूने रोटी क्यों नहीं खायी ? | మీరు నేడు ఎందుకు రొట్టె తినలేదు. |
| अम्मा ने घर में रोटी नहीं बनायीं। | అమ్మ యీవేళ యింట్లో రొట్టె చేయలేదు. |
| तुम इतनी देर से क्यों आये ? | మీరు ఇంత ఆలస్యముగ ఏల వచ్చితిరి? |
| आज मैं एक सभा में गया और वहाँ से लौटने में देर हुई ; माफ़ कीजिये, मैं अब से कभी देर न करूँगा। | నేడు నేను ఒక సభ చూచుటకు పోతిని, అక్కడనుంచి తిరిగి వచ్చుటకు ఆలస్యమైనది ; క్షమించండి. నేను యిప్పటినుండి ఎప్పుడు ఆలస్యము చేయను. |

| | |
|---|---|
| कल कृष्ण कहाँ थे, वे क्यों दफ़्तर नहीं आये? | నిన్న కష్ణయ్యగారు ఎక్కడ ఉండిరి? వారు అఫీసునకు ఏల రాలేదు? |
| शायद कल उनकी तबीयत ठीक नहीं थी, इसलिए वे दफ़्तर नहीं गये। | బహుశా నిన్న ఆయన ఆరోగ్యము చక్కగలేదు కాబోలు కావున వారు కచ్చేరికి వెళ్లలేదు. |
| आज पाँच बजे की गाड़ी से आपके भाई के दोस्त यहाँ आये, लेकिन आपके भाई अभी तक अदालत से नहीं लौटे। | నేడు అయిదుగంటల బండిలో తమ సోదరుని స్నేహితులు యిక్కడికి వచ్చిరి కాని తమ సోదరులు ఇంత వరకు కోర్టునుండి తిరిగి రాలేదు. |
| जब मैंने उनको उनके दोस्त के आने की ख़बर दी तब उन्होंने कहा, "चलो, मैं थोड़ी देर में आऊँगा।" | నేను వారితో వారి మిత్రులు వచ్చిన సంగతి చెప్పినపుడు వారు "పదండి నేను కొంచెము సేపటిలోవచ్చెదను" అని చెప్పిరి. |
| जिन्होंने यह लेख लिखा उन्होंने पचास रुपये इनाम पाये। | ఈ వ్యాసము వ్రాసినవారు ఏబది రూప్యములు బహుమానము పొందిరి. |
| उनकी समझ में यह बात ज़रा भी नहीं आयी कि यह काम कैसे हुआ। | ఈ పని ఎట్లు జరిగినదియని వారికి కొంచెముకూడ తెలియలేదు. |
| मैं कल अडयार में तुम्हारी बहिन से मिला; उन्होंने कहा कि वे कल सबेरे यहाँ आवेंगी। | నేను నిన్న అడయారులో మీ సోదరిని చూచితిని. ఆమె రేపు ప్రొద్దున యిక్కడికి వచ్చెదనని చెప్పిరి. |
| जब सूरज निकला तब मैं रवाना हुआ, इसलिए आप के यहाँ बड़ी देर से पहुँचा। | సూర్యోదయమైన తర్వాత బయలుదేరితిని. కాబట్టి మీవద్దకు ఆలస్యముగ జేరితిని. |

| | |
|---|---|
| उन्होंने कल जो काम शुरू किया वह अभी तक ख़तम नहीं हुआ। | వారు నిన్న ప్రారంభించిన కార్య మింకను పూర్తికాలేదు. |
| मैं आशा करता हूँ कि वह अब जल्दी पूरा हो जायगा। | ఇపుడది త్వరగ ముగియునని ఆశించు చున్నాను. |
| पुलिस ने उसे पकड़ने की बहुत कोशिश की, पर कोई लाभ नहीं हुआ। | పోలీసువారు అతనిని పట్టుకొనుటకు చాల ప్రయత్నించిరి కాని యేమియు లాభము లేకపోయెను. |
| जिस समय कलकत्ते की गाड़ी रवाना हुई उस समय मैं स्टेशन पर था। | కలకత్తా వెళ్లు బండి బయలుదేరు వేళకు నేను స్టేషనువద్ద నుంటిని. |
| जिस काम को तुमने शुरू किया उसे ज़रूर पूरा करो। | ఏ పనిని ప్రారంభించెదవో దానిని తప్పక పూర్తిచేయుము (ప్రారంభించిన కార్యమును తప్పక నెరవేర్పుము). |
| जब हमने वसन्ती देवी के आने की ख़बर सुनी, तब हम बहुत खुश हुए। | వసంతీ దేవిగారు వచ్చు సమాచారము విని మేము చాల సంతసించితిమి. |

---

## పాఠము 16.

### భూతకాలము

35. ఆసన్నభూతకాలము, పూర్ణభూతకాలము, సందిగ్ధభూతకాలము (ఒక కార్యము జరిగియుండునని సందేహమును తెల్పునది) ఈ మూడు కాలముల రూపములును సామాన్య భూతకాలమునుండి యేర్పడును గావున సామాన్య భూతకాలమునకు సంబంధించిన నియమములన్నియు వీనికిని అన్వయించును (పాఠము 15).

36. ఆసన్న భూతకాలము—

(అ) క్రియ అకర్మకమైనచో సామాన్య భూతకాల రూపమునకు చివర హూఁ, హై, హైఁ, హో లను కర్త ననుసరించి చేర్చిన (15వ పాఠము చూడుడు) ఆసన్న భూతకాలమగును.

ఉదా :—

| (ఏ. వ.) | పుంలింగము | (బ. వ.) |
|---|---|---|
| मैं गया हूँ నేను వెళ్లియున్నాను | | हम गये हैं మేము వెళ్లియున్నాము |
| तू गया है నీవు వెళ్లియున్నావు | | तुम गये हो మీరు వెళ్లియున్నారు<br>आप गये हैं వారు వెళ్లియున్నారు |
| वह गया है వాడు వెళ్లియున్నాడు | | वे गये हैं వారు వెళ్లియున్నారు |
| | స్త్రీలింగము | |
| मैं गयी हूँ నేను వెళియున్నాను | | हम गयी हैं మేము వెళ్లియున్నాము |
| तू गयी है నీవు వెళ్లియున్నావు | | तुम गयी हो మీరు వెళ్లియున్నారు<br>आप गयी हैं తమరు వెళ్లియున్నారు |
| वह गयी है ఆమె వెళ్లియున్నది | | वे गयी हैं వారు వెళ్లియున్నారు |

(ఆ) క్రియ సకర్మకమైనచో కర్మయొక్క లింగవచనముల ననుసరించి క్రియను మార్చి హై, హైఁ లను సామాన్యభూతకాల రూపమునకు చేర్చవలెను. (పాఠము 15, నియమము 32, 33).

ఉదా :—मैंने एक घोड़ा देखा है నేను ఒక గుఱ్ఱమును చూచియున్నాను.
मैंने घोड़े देखे हैं నేను గుఱ్ఱములను చూచియున్నాను.
मैंने रोटी खायी है నేను రొట్టెతినియున్నాను.
मैंने रोटियाँ खायी हैं నేను రొట్టెలు తినియున్నాను.

పై వాక్యములలో కర్మతో విభక్తిప్రత్యయము లేదు కావున క్రియ కర్మను అనుసరించియున్నది.

కర్మకు ప్రత్యయమున్నను లేక కర్మయే లోపించినను క్రియ పుంలింగ ఏకవచనమునందుండును (నియమము 37 చూడుడు).

ఉదా :— मैंने देखा है నేను చూచియున్నాను.

हमने देखा है మేము చూచియున్నాము.

मैंने सीता को देखा है నేను సీతను చూచియున్నాను.

పై మొదటి రెండు వాక్యములయందును కర్మలోపించియున్నది కావున, మూడవ వాక్యములో కర్మకు ప్రత్యయము గలదు గనుకను క్రియ పుంలింగ ఏకవచనమునందు ఉన్నది.

37. పూర్ణభూతకాలము—

(అ) క్రియ అకర్మకమైనచో సామాన్య భూతకాలరూపమును కర్త యొక్క లింగవచనములను అనుసరించి మార్చి దానికి భూతకాలిక సహాయక క్రియను అనగా కర్త పుంలింగ ఏకవచనమైనచో '**था**', బహువచనమైనచో '**थे**', స్త్రీలింగ ఏకవచనమున '**थी**' బహువచనమున '**थीं**' ను, చేర్చవలెను.

ఉదా :— मैं गया था నేను వెళ్లియుంటిని.

हम गये थे మేము వెళ్లియుంటిమి.

सीता गयी थी సీత వెళ్లియుండెను.

स्त्रियाँ गयी थीं స్త్రీలు వెళ్లియుండిరి.

(ఆ) క్రియ సకర్మకమైనచో కర్మయొక్క లింగవచనముల ననుసరించి **था, थे, थी, थीं** లను చేర్చవలెను. ने నియమముల ననుసరించి కర్తకు క్రియకును ఏలాటి సంబంధముండదు.

ఉదా :— मैंने एक घोड़ा देखा था నేను ఒక గుఱ్ఱమును చూచియుంటిని.

मैंने कई घोड़े देखे थे నేను చాల గుఱ్ఱములను చూచియుంటిని.

मैंने एक घोड़ी देखी थी నేను ఒక ఆడు గుఱ్ఱమును చూచియుంటిని.

मैंने घोड़ियाँ देखी थीं నేను ఆడు గుఱ్ఱములను చూచియుంటిని.

కర్మ లోపించినను లేక విభక్తి ప్రత్యయముతో కూడియున్నను క్రియ పుంలింగ ఏకవచనమందేయుండును (నియమము 37 చూడుడు).

ఉదా :—मैंने देखा था, हमने देखा था, मैंने लक्ष्मी को देखा था నేను లక్ష్మిని చూచియుంటిని.

38. సందిగ్ధ భూతకాలము—

(అ) భూతకాలములో సందేహమును తెలియజేయుటకు క్రియ అకర్మకమైనచో **हूँगा, होगा, होंगे, होगे** అను సామాన్య భూతకాలరూపములతో కర్తయొక్క లింగవచనముల ననుసరించి చేర్చవలెను (పాఠము 15 నియమము 34 చూడుడు).

ఉదా :—

| (ఏ. వ.) | పుంలింగము (బ. వ.) |
|---|---|
| मैं गया हूँगा నేను వెళ్లియుందును | हम गये होंगे మేము వెళ్లియుందుము |
| तू गया होगा నీవు వెళ్లియుందును | तुम गये होगे మీరు వెళ్లియుందురు<br>आप गये होंगे తమరు వెళ్లియుందురు |
| वह गया होगा వాడు వెళ్లియుండును | वे गये होंगे వారు వెళ్లియుందురు |

స్త్రీలింగము

| | |
|---|---|
| मैं गयी हूँगी నేను వెళ్లియుందును | हम गयी होंगी మేము వెళ్లియుందుము |
| तू गयी होगी నీవు వెళ్లియుందువు | तुम गयी होगी మీరు వెళ్లియుందురు<br>आप गयी होंगी తమరు వెళ్లియుందురు |
| वह गयी होगी ఆమె వెళ్లియుండును | वे गयी होंगी వారు వెళ్లియుందురు |

(అ) క్రియ సకర్మకమైనచో లింగవచనములు కర్మ ననుసరించియుండును. అపుడు **होगा** పుంలింగ ఏకవచనమందును, **होंगे** బహువచనమందును, **होगी** స్త్రీలింగ ఏకవచనమందును, **होंगी** బహువచనమందును ఉపయోగింపబడును.

ఉదా :—**मैंने घोड़ा देखा होगा** నేను గుఱ్ఱమును జూచియుందును.
**मैंने घोड़े देखे होंगे** నేను గుఱ్ఱములను జూచియుందును.
**मैंने घोड़ी देखी होगी** నేను ఆడు గుఱ్ఱమును జూచియుందును.
**मैंने घोड़ियाँ देखी होंगी** నేను ఆడుగుఱ్ఱములను జూచియుందును.

**उपन्यास** నవల
**सरनामा, पता** అడ్రసు, చిరునామా
**दान** దానము
**पैखाना, टट्टी** మరుగుదొడ్డి
**आराम** విశ్రాంతి
**स्वदेशी** స్వదేశీ
**फूल** పువ్వు (పు)
**इस्तेमाल करना** ఉపయోగించుట
**बत्ती** (స్త్రీ.) వత్తి, దీపము
**नाटक** నాటకము
**सामान** సామాను
**मेहरबानी, कृपा** (స్త్రీ.) దయ
**बदबू** చెడువాసన
**ख़ुशबू** (స్త్రీ.) సువాసన
**विदेशी** విదేశీ
**कली** (స్త్రీ.) మొగ్గ
**पसंद करना** ఇష్టపడుట
**जला** వెలిగించు

**ख़ुशबूदार** వాసనగల

| | |
|---|---|
| आज तुम्हारे पिता कहाँ गये हैं ? | నేడు మీ తండ్రిగారు ఎక్కడికి వెళ్లియున్నారు ? |
| कुछ सामान ख़रीदने बाज़ार गये हैं। | కొన్ని సామానులు కొనుటకు బజారుకు వెళ్లియున్నారు. |
| तुमने यह उपन्यास कभी पढ़ा है ? | మీరు ఈ నవల ఎప్పుడైన చదివియున్నారా ? |

| | |
|---|---|
| हाँ, दो वर्ष पहले मैंने एक बार यह पुस्तक पढ़ी थी। | ఔను, రెండు సంవత్సరముల క్రిందట నేను ఒకసారి ఈ పుస్తకము చదివి యుంటిని. |
| कल, जब मैं तुमसे मिलने तुम्हारे घर गया था, तब तुम कहाँ गये थे? | నిన్న నేను మిమ్ములను చూచుటకు మీ యింటికి వచ్చినపుడు మీరు ఎక్కడికి వెళ్ళియుంటిరి? |
| मैं बाहर नहीं गया था, उस समय मैं सोया था। | నేను బయటకు వెళ్ళియుండలేదు, అప్పుడు నిద్రపోవుచూ ఉంటిని. |
| जो आदमी कल आपके घर आया था उसका पता क्या है? | నిన్న తమ యింటికి వచ్చినవాని చిరునామా ఏమి? |
| मैंने उस आदमी को इसके पहले कभी नहीं देखा था, इसलिए मैं उसका पता नहीं जानता। | నేను ఆ మనుష్యుని ఇంతకుముందు ఎప్పుడును చూచియుండలేదు, కావున అతని చిరునామా నేను ఎరుగను. |
| उन्होंने आपसे यह बात कही होगी, पर मुझसे किसीने नहीं कही। | ఆయన తమతో ఈ మాట చెప్పియుండవచ్చును, కాని నాతో ఎవరును చెప్పలేదు. |
| रामचन्द्र ने यह नाटक देखा होगा, पर अब उसे याद नहीं। | రామచంద్రుడు ఈ నాటకము చూచియుండవచ్చును, కాని ఇప్పుడు వానికి జ్ఞప్తిలేదు. |
| आपकी मेहरबानी से मैंने वहाँ बहुत आराम पाया था। | తమ దయవలన నేను అచ్చట చాల సుఖము పొందియుంటిని. |
| मैंने उनकी मदद से ही यह काम किया है। | నేను వారి సాయమువలననే యీ కార్యమును చేసితిని. |
| आप थोड़ी देर बैठिये, रामनाथ पैखाने गये हैं, जल्दी आयँगे। | తమరు కొంచెమునేపు కూర్చొనుడు, రామనాథ్‌గారు మరుగుదొడ్డి వెళ్ళియున్నారు, త్వరగా వచ్చెదరు. |

| | |
|---|---|
| मैं इस फूल की ख़ुशबू बहुत पसन्द करता हूँ। | ఈ పువ్వు సువాసన నాకు చాల యిష్టము. |
| इस घर में बदबू आती है, इसमें मत रहो। | ఈ యింటిలో చెడువాసన వచ్చు చున్నది. దీనిలో నుండకుడు. |
| आप स्वदेशी चीज़ें इस्तेमाल करते हैं या विदेशी? | తమరు స్వదేశీ వస్తువుల నుపయోగించు చున్నారా, లేక విదేశీయా ? |
| मैं कुछ स्वदेशी और कुछ विदेशी चीज़ें इस्तेमाल करता हूँ। | నేను కొన్ని స్వదేశీ వస్తువులను కొన్ని విదేశీ వస్తువులను ఉపయోగించు చున్నాను. |
| किसने बत्ती जलायी? | ఎవరు దీపమును వెలిగించెను ? |
| इस मकान में बिजली की बत्तियाँ नहीं हैं। | ఈ ఇంటిలో విద్యుచ్ఛక్తి దీపములు లేవు. |
| गुलाब का फूल सुन्दर भी है और ख़ुशबूदार भी। | గులాబిపువ్వు అందముగలదిగాను, వాసనగలదిగాను ఉన్నది. |
| मुझे उसकी बात बहुत पसन्द आयी। | నాకు వానిమాట చాల నచ్చినది. |

## పాఠము 17.

### భూతకాలము (తరువాయి)

### హేతుహేతు, అపూర్ణ, తాత్కాలిక భూతకాలములు.

39. కార్యకారణ సంబంధముచే రెండు పనులు జరుగలేదని తెలుపునది హేతుహేతుమద్భూతకాలము.

ఉదా :—వాడు వచ్చియుండినచో నేను వెళ్లెడివాడను (వాడు రానూలేదు. నేను వెళ్లనూలేదు).

1. ఇందు మొదటిది 'కారణ' వాక్యమనియు, రెండవది 'కార్య' వాక్యమనియు చెప్పుదురు. పై కారణ కార్య వాక్యములలోని ధాతువునకు పుంలింగ ఏకవచనములో **ता** యు పుంలింగ బహువచనములో **ते** యు స్త్రీలింగ ఉభయవచనములలో **ती** యు చేర్చి కారణవాక్యమునకు ముందు **'अगर'** లేక **'यदि'** యును, 'కార్య' వాక్యమునకు ముందు **'तो'** యును చేర్చినచో హేతుహేతుమద్భూతకాలము కాగలదు.

ఉదా :—**अगर राम आता** రాముడు వచ్చియుండినచో (కారణవాక్యము).
**तो जानकी जाती** జానకి వెళ్లెడిది (కార్యవాక్యము)

2. కారణవాక్యమునకు మొదటనుండు **अगर** యొక్క సంపూర్ణార్థము కార్యవాక్యమునకు మొదటనుండు **तो** యందును స్పష్టమగుట బట్టి కొన్నివేళల **अगर** లోపించ వచ్చునుగాని **तो** మాత్రము లోపించదు.

ఉదా :—**राम आता तो सीता जाती** రాముడు వచ్చియుండిన సీత వెళ్లెడిది (రాముడు రానూలేదు సీత వెళ్లనూలేదు).

40. అపూర్ణ భూతకాలము (జరిగిన కాలములో కార్యము పూర్తిగా లేదని తెల్పునది) హేతుహేతుమద్భూతకాలరూపమునకు లింగవచనముల ననుసరించి (1) **'था'** ను చేర్చినచో అపూర్ణ భూతకాలమగును. (2) **'होगा'** చేర్చినచో సందిగ్ధ వర్తమాన కాలమగును.

(1) అపూర్ణ భూతకాలము.

ఉదా :—**मैं खाता था** నేను తినుచుంటిని.
**वह खाता था** వాడు తినుచుండెను.
**लड़के खेलते थे** బాలురు ఆడుకొనుచుండిరి.
**वह खाती थी** ఆమె తినుచుండెను.
**लड़कियाँ खाती थीं** బాలికలు తినుచుండిరి

(2) సందిగ్ధ వర్తమానకాలము.

ఉదా :—**वह खाता होगा** వాడు తినుచుండును.

**वह खाती होगी** ఆమె తినుచుండును.

**वे खाते होंगे** వారు తినుచుందురు.

**वे खाती होंगी** వారు తినుచుందురు.

సూచన :—సందగ్ధ వర్తమానకాలము ఉత్తమ పురుషలో నుండదు. మధ్యమపురుషలో అరుదుగా ఉపయోగింతురు. అప్పుడు **तू खाता होगा, तुम खाते होगे, आप खाते होंगे** నీవు తినుచుందువు. మీరు తినుచుందురు. తమరు తినుచుందురు అని అనవచ్చును. వీని స్త్రీలింగములు **आ, ए, ई** నియమముల ననుసరించి అగును :—**तू खाती होगी, तुम खाती होगी, आप खाती होंगी ।**

**'ता'** కు బదులు **रहा** లింగ వచన, పురుషల ననుసరించి చేర్చిన తాత్కాలిక సందిగ్ధ వర్తమానకాలమగును.

ఉదా :—**वह जा रहा होगा** వాడు వెళ్లుచూ ఉండును.

41. తాత్కాలిక భూతకాలము—

గడచిన కాలమునందొక కార్యమింకను జరుగుచునేయుండెనని దెల్పునది తాత్కాలిక భూతకాలమగును.

(1) ధాతువునకు **आ, ए, ई** నియమము ననుసరించి **रहा था** చేర్చిన తాత్కాలిక భూతకాలమగును.

ఉదా :—**वह आ रहा था** వాడు వచ్చుచూ ఉండెను.

**सीता पढ़ रही थी** సీత చదువుచూ ఉండెను.

**लड़के आ रहे थे** బాలురు వచ్చుచూ ఉండిరి.

సూచన :—ఈ పైకాలములో కర్తతోకూడ **ने** ప్రత్యయము ఉపయోగింపబడును.

चावल బియ్యము
गेहूँ గోధుమలు
शराब మద్యము, సారాయి
नक़द (స్త్రీ.) రొక్కము
रिश्तेदार బంధువు
चाचा తండ్రి సోదరుడు
तैयार సంసిద్ధముగా
सस्ता చౌక
नया క్రొత్త
फटा చినిగిన
ज़ोर से తీవ్రముగ
ज़रूरी అవసరమైన, ముఖ్యమైన
बिकना అమ్ముడుపోవుట
बताना చెప్పుట, చూపుట
पहचानना గుర్తించుట
बाल बनवाना క్షౌరము చేయించు
కొనుట

साबुन సబ్బు
आटा పిండి
शक्कर (స్త్రీ.) చక్కెర
उधार అప్పు
शादी, (స్త్రీ.) विवाह పెండ్లి
मामा తల్లి సోదరుడు
बातचीत (స్త్రీ) సంభాషణ
महँगा ప్రియమైన
पुराना పాత
सड़ा కుళ్లిన
हर ప్రతియొక్క
पहले మొదట
बन्द करना మూయుట
छूना తాకుట
मना करना నిషేధించుట, ఆటంక
పరుచుట
हुक़ूमत चलाना ఆజ్ఞాపించుట

| | |
|---|---|
| आप कल यहाँ आते तो मैं भी आपके साथ समुद्र चलता। | తమరు నిన్న ఇక్కడికి వచ్చియుండి నచో నేనును తమ వెంట సముద్ర మునకు వచ్చియుందును. |
| तुम अपनी बात मुझे बताते तो अच्छा होता। | మీరు మీ విషయము నాతో చెప్పియుం డిన బాగుండెడిది. |
| जब तुम्हारे रिश्तेदार मेरे घर आये थे, तब मैं आटा और शक्कर खरीदने बाज़ार जा रहा था। | మీ బంధువులు నా యింటికి వచ్చినపుడు నేను పిండి, చెక్కెర కొనుటకు బజారుకు వెళ్లియుంటిని. |

| | |
|---|---|
| वे पहले इस साबुन को इस्तेमाल करते थे, पर आजकल नहीं करते। | వారు మొదట యీ సబ్బును వాడుచుండిరి. కాని యిప్పుడు వాడుటలేదు. |
| मेरे चाचा दो वर्ष तक उस पुराने मकान में रहते थे और उसके लिए वे पचीस रुपये किराया देते थे। | మా పినతండ్రి రెండు ఏండ్లవరకు ఆ యింటిలో నివసించుచు దానికి యిరువదియైదు రూపాయలు బాడుగనిచ్చుచుండిరి. |
| मैं इस पुराने मकान में रहना नहीं चाहता; क्योंकि इसमें हवा नहीं। | నేను యీపాత యింటిలో నుండదలచుకొనలేదు. ఏలనగా దీనిలో గాలి రాదు. |
| कल ख़ूब ज़ोर से पानी बरस रहा था, इसलिए मैं बाहर नहीं गया। | నిన్న చాలా ఎక్కువగా (మిక్కుటముగ) వర్షము కురియుచుండెను కావున నేను బయటకు రాలేదు. |
| उसके कपड़े फटे पुराने थे, इसलिए मैंने उसे नहीं पहचाना। | వాని బట్టలు చినిగి పేలికలైయుండెను, అందువలన వానిని నేను గుర్తించలేదు. |
| गोपाल की शादी की बातचीत हो रही है, लेकिन वह अभी शादी नहीं करना चाहता। | గోపాలుని వివాహ ప్రసంగము జరుగుచున్నదిగాని వాడు ఇప్పుడే పెండ్లి చేసికొన గోరుటలేదు. |
| वह कभी किसी से कोई चीज़ उधार नहीं लेता। | వాడు ఎప్పుడును ఎవరివద్దకూడ ఏ వస్తువును అప్పుతీసికొనడు. |
| वह पहले बहुत शराब पीता था, लेकिन जब से मैंने उसे मना किया तब से वह शराब छूता भी नहीं। | వాడు మొదట విశేషముగ సారాయి త్రాగుచుండెను కాని నేను వానితో వద్దని చెప్పినప్పటినుంచి వాడు సారాయి ముట్టుకొనుటగూడ లేదు. |

मुझे आज कई ज़रूरी काम थे, इसलिए बाल नहीं बनाया।

నాకు నేడు చాల అవసరమగు కార్యములుండుటచే క్షౌరము చేయించుకొన లేదు.

वह हर रोज़ हमारी दूकान से कुछ चीज़ें उधार लेता है।

వారు ప్రతిదినము మా దుకాణమునుండి కొన్ని వస్తువులు అప్పు తీసికొనుచున్నాడు.

उसके मामा के पास नक़द रुपये बहुत हैं।

వాని మామవద్ద రొక్కము చాల గలదు.

यहाँ चावल बहुत सस्ता बिकता है, लेकिन गेहूँ बहुत महँगा है।

ఇక్కడ బియ్యము చాల చౌకగా అమ్ముచున్నవి గాని గోధుమలు చాల ప్రియము.

वे लोग गावों और शहरों में शराब पीना बन्द करने की कोशिश कर रहे हैं।

వారు గ్రామములోను పట్టణములోను (సారాయి) త్రాగుట విడిచివేయుటకు ప్రయత్నించుచున్నారు.

हम अपने देश के लिए सब कुछ करने को तैयार हैं।

మేము మా దేశముకొరకు ఏమైనను (సర్వము) చేయుటకు సంసిద్ధముగ నున్నాము.

आप ज़बर्दस्ती हमारे ऊपर हुकूमत करना चाहते हैं।

తమరు బలవంతముగా మాపై అధికారము సాగింప గోరుచున్నారు.

स्वदेशी चीज़ों का ही इस्तेमाल करना हमारे लिये बहुत ज़रूरी है।

మనము కేవలము దేశీయ వస్తువులనే యుపయోగించుట అత్యావశ్యకమై యున్నది.

जब मैं दफ़्तर से लौट रहा था, तब रास्ते में वे मिले।

నేను కచ్చేరినుండి వచ్చుచుండగా త్రోవలో వారు కలిసిరి.

आगर मैं उनको पहचानता, तो ज़रूर उनसे बातचीत करता।

నేను వారిని గుర్తించియుండినచో తప్పక వారితో సంభాషించి యుందును.

| | |
|---|---|
| वे रामनाथजी के साथ बातचीत करते होंगे। | వారు రామనాథ్ గారితో మాట్లాడుచుందురు. |
| अब वह आता होगा। | వారు ఇప్పుడు వచ్చుచుండును. |
| आप सुब्बाराव को पहचानते होंगे। | తమరు సుబ్బారావుగారిని ఎరిగియుందురు. |
| अब दो बज रहे होंगे। | ఇప్పుడు రెండు (మ్రోగుచూ) కొట్టుచూఉండును. |

---

## పాఠము 18.

## సంభావ్య భవిష్యత్కాలము

42. ఇది భవిష్యత్కాలము (11-వ పాఠము చూడుడు) లోని ఒక భేదము. దీని ప్రయోగములు క్రింద వివరింపబడుచున్నవి.

1. సామాన్య భవిష్యత్కాలము (11-వ పాఠము) లోని కడపటి **गा, गे, गी** లను తీసివేసినచో యీ రూపమేర్పడును.

స్త్రీలింగ పుంలింగముల రెండింటిలోను రూపమొకటిగనే యుండును.

| | |
|---|---|
| ఉదా :—मैं खाऊँ | हम खाएँ |
| तू खाए | तुम खाओ, आप खाएँ |
| वह खाए | वे खाएँ |
| मैं लूँ | हम लें |
| तू ले | तुम लो, आप लें |
| वह ले | वे लें |

43. సంభావ్య భవిష్యత్తుయొక్క వివిధప్రయోగములు.

నిమిత్తము (ఒక పని జరుగుటకుగాని, జరుగకుండుటకుగాని), కోరిక, ఆజ్ఞ, అనుమతి, మరతు, సందేహము వీనిని వ్యక్తపరచుటకు సంభావ్య భవిష్యత్కాల ముపయోగింపబడును.

1. నిమిత్తము (purpose)—

ఇందులో నిమిత్తమును సూచించు వాక్యమునకు ముందట कि గాని जिससे గాని యుండును.

ఉదా:—तुम उसको यहाँ बुलाओ जिससे वह मैसूर न जावे అతడు మైసూరు పోకుండునట్లుగా అతనిని ఇచ్చటకు పిలువుడు.

2. కోరిక, ఆజ్ఞ, అనుమతి—

కోరిక—भारतवासियों के सब दुख दूर हों భారతీయుల దుఃఖము లన్నియు తొలగుగాక.

ఆజ్ఞ—वह आज घर न जावे అతడు నేడు యింటికి పోరాదు (వాడు యింటికి పోకూడదు).

అనుమతి—मैं जाऊँ నేను వెళ్లనా? నన్ను పొమ్మనెదరా?
मैं बोलूँ నేను మాట్లాడనా?

3. షరతు—

దీనిలో కార్యకారణ సంబంధమును తెలుపు రెండు వాక్యములు तो అను సముచ్చయముతో నొకటిగా చేర్పబడియుండును. (17-వ పాఠము 1, 2 నియమములు చూడుడు).

ప్రథమమున కారణవాక్యము यदि లేక अगर తో ప్రారంభమగును. కొన్నివేళల యిది లోపించును. 'కార్య' వాక్యమునకు ముందట 'तो' మాత్రము తప్పక నుండవలయును.

ఉదా:—अगर (यदि) वह ऐसा कहे అతడు యిటు చెప్పినచో तो तुम यहीं रहो మీరు యిక్కడనే యుండుడు. (अगर) तुम वहाँ जाओ तो उनसे ज़रूर मिलो మీరు అక్కడికి వెళ్లినచో వారిని తప్పక కలిసికొనుడు.

(హేతుహేతుమద్భూతకాలమునకును దీనికిగల భేదము ఏమన, హేతుహేతుమద్భూతకాలములో రెండు కార్యములును జరుగలేదని తెలియును. సంభావ్య భవిష్యత్కాలములోని షరతులో ఒకటి జరుగుచో రెండవది జరుగును అని తెలియును).

సూచన :—సంభావ్య భవిష్యత్కాలములో **'तुम'** కర్తగానున్నప్పుడు దాని రూపము విధ్యర్థక రూపమును (2-పాఠము చూడుడు) బోలియుండును. అర్థమును బట్టి కాలభేదమును నిర్ణయించుకొనవలెను.

ఉదా :—**तुम कहो तो मैं रहूँगा** మీరు చెప్పినచో నేనుందును.

**(कहो तो, कहोगे तो)** (సం. భవిష్యత్).

**अगर उनसे मिलो तो ज़रूर यह काम हो जायगा** మీరు వారిని కలసినచో ఈ పని తప్పక అగును.

**तुम न समझो तो मैं क्या करूँगा?** మీరు తెలుసుకొనకపోతే నేనేమి చేయుదును.

4. సందేహము, అనుమానము—

**कौन जाने?** ఎవడెరుగును?

**मैं क्या जानूँ?** నేనేమెరుగుదును?

**ऐसा हो तो** ఇట్లైనచో (అనుమానము).

**वे वहाँ हों तो** (బహుశా) వారక్కడుండే

**मेरे पास पाँच हज़ार रुपये हों तो** నా దగ్గర అయిదువేల రూపాయలుండే

**धोबी** చాకలి
**क़सूर** తప్పిదము
**फ़ायदा** లాభము
**कसरत** (స్త్రీ.) వ్యాయామము
**हवा** (స్త్రీ.) గాలి
**सर्दी** (స్త్రీ.) **ज़ुकाम** (పుం.) జలుబు
**तक़लीफ़** (స్త్రీ) కష్టము
**दया, मेहरबानी** (స్త్రీ.) దయ
**नुक़सान** నష్టము, హాని
**चेहरा** ముఖము
**दवा** (స్త్రీ.) మందు
**बुख़ार** జ్వరము

कमज़ोर బలహీనమైన
साफ़ శుభ్రమైన
सेव సీమరేగుపండు
दूसरा ఇతర, మరియొక
ख़ुदा భగవంతుడు
मेहनत करना పరిశ్రమచేయుట
टहलना పచారుచేయుట
मालूम होना తెలియుట, కనుపించుట
जानना ఎరుగుట
मज़बूत బలిష్ఠమైన
गन्दा మురికియగు
अंगूर పచ్చిద్రాక్ష
इच्छा (స్త్రీ.) కోరిక, అభిప్రాయము
तक వరకు
वापस आना మరలి వచ్చుట
मालूम తెలిసినది
मदद करना సాయపడుట
मानना ఒప్పుకొనుట, భావించుట

| | |
|---|---|
| अगर धोबी मेरे कपड़े लावे तो, मैं आज ज़रूर निकलूँगा। | చాకలి నా బట్టలు తెచ్చుచో నేను నేడు తప్పక బయలు దేరుదును. |
| उसकी तकलीफ़ देखो तो उस पर दया आयेगी। | వాని కష్టమును చూచినచో వానిమీద తప్పక దయ కలుగును. |
| तुम अपना क़सूर मानो तो मैं तुमको माफ़ करूगा। | మీరు మీతప్పిదము ఒప్పుకొన్నచో నేను (మిమ్ములను) క్షమించెదను. |
| आप उनके साथ न जायें तो भी कोई नुकसान नहीं है। | తమరు అతనివెంట పోకున్నను ఏమియు నష్టము లేదు. |
| इस काम में कोई फ़ायदा न हो तो भी वह इसे ज़रूर करेगा। | ఈ కార్యములో నేమియులాభము లేకున్నను వాడు దీనిని తప్పక జేయును. |
| क्या आपकी यह इच्छा है कि मैं उनकी मदद करूँ? | నేను అతనికిసాయము చేయవలయునని తమ అభిప్రాయమా ? |
| मैं आपके लिए कुछ सेव और अंगूर लाऊँ? | నేను తమకు కొన్ని సీమరేగుపండ్లు ద్రాక్షపండ్లు తీసికొనిరానా ? |
| जब तक मैं वापस न आऊँ तब तक आप यहीं ठहरें। | నేను మరల వచ్చునంతవరకు తమరిచ్చటనే యుండండి (ఉండుడుగాక). |

| | |
|---|---|
| आप कल आवे और उस काम को ख़तम करने में मेरी मदद करें। | తమరు రేపు వచ్చి యీ పని పూర్తి చేయుటలో నాకు సహాయము చేయుదురుగాక (చేయండి). |
| ख़ूब कसरत करो जिससे मज़बूत बनो। | బలిష్ఠులవగుటకు చక్కగా కసరతు చేయుము. |
| आप उस लड़के को कुछ इनाम दीजिये, जिससे वह ख़ूब मेहनत करे। | బాగుగా పరిశ్రమ చేయగలందులకు గాను తమరు ఆ బాలునికి ఏదైన బహుమానము ఇవ్వండి. |
| बुखार आवे, तो उन्हें मेरी दवा खाने को कहिये। | వారికి జ్వరము వచ్చినట్లయితే నామందు తినమని చెప్పుము. |
| रोज़ सुबह साफ़ हवा में टहलो तो तुम्हारी तबीयत अच्छी रहेगी। | నిత్యము ప్రాతఃకాలమున పరిశుభ్రమైన గాలిలో తిరిగినచో మీ ఆరోగ్యము చక్కబడును. |
| उसका चेहरा देखो, तो वह बहुत कमज़ोर मालूम होगा। | వాని ముఖము చూచినచో వాడు చాల బలహీనుడుగా కనిపించును. |
| ख़ुदा जाने वे क्या करना चाहते हैं! | వారేమి చేయదలచుచున్నారో భగవంతుని కెరుక. |
| तुम यह काम करना पसन्द नहीं करते तो मैं तुमको दूसरा काम देता। | ఈ పని చేయుటకు మీరు ఇష్టపడియుండనిచో నేను మీకు మరియొక పని యిచ్చియుందును. |
| गन्दा पानी पीने से ज़ुकाम होता है। | మురికి నీరు త్రాగుటచే జలుబు చేయును. |
| मुझे इसका नाम मालूम था, लेकिन अभी याद नहीं। | నా కతని పేరు తెలియును కానియిప్పుడు జ్ఞప్తిలేదు. |
| अगर वहाँ उमदा और मीठे आम मिलें तो मेरे लिए कुछ ज़रूर ख़रीदो। | అచ్చట మంచి తియ్యని మామిడిపండ్లు దొరుకుచో నాకొఱకు కొన్ని తప్పక కొనుము. |

| | |
|---|---|
| मैंने सुना है कि कल गान्धीजी का व्याख्यान है। अगर ऐसा हो तो हम वहाँ ज़रूर चलेंगे। | రేపు గాంధిగారి యుపన్యాసమని నేను విన్నాను. అట్లయినచో మనము అప్పటికి తప్పక వెళ్లుదము. |
| अगर वे वहाँ न हों, तो तुम वापस चले आना। | వారక్కడ లేకున్న నీవు తిరిగి రావలసినది. |
| कहूँ तो क्या कहूँ? | చెప్పుదమన్న నేమి చెప్పుదును? |
| जाऊँ तो कहाँ जाऊँ? | పోవుదమన్న ఎక్కడికి పోను? |
| करूँ तो क्या करूँ? | చేయదలచినచో ఏమి చేయుదును? |
| हो न हो। | నిశ్చయముగా. |
| पण्डित हो या मूर्ख। | పండితుడైనను (సరే). మూర్ఖుడైనను (సరే). |
| दोस्त हो या दुश्मन। | మిత్రుడైనను (సరే). శత్రువైనను (సరే). |
| जो करो। | ఏమి చేసినను (సరే). |
| जो कहो। | ఏమి చెప్పినను (సరే). |
| जो चाहो। | ఏమి కోరినను (సరే). |

---

## పాఠము 19.

## కృదంతములు

**44.** వర్తమానకాలిక కృదంతము—

1. ఒక కార్యమును చేయుచు తోడ్తోడ మఱియొక కార్యమును గూడ జేయుచో మొదటి కార్యమును సూచించుటకు "వర్తమానకాలిక కృదంతము" వాడబడును.

ధాతువునకు '**ता**' గాని "**ता हुआ**" గాని కర్తయొక్క లింగ వచనముల ననుసరించి చేర్చినచో వర్తమాన కాల కృదంతమగును.

ఉదా :—**वह गाता (हुआ) आता है** వాడు పాడుచూ వచ్చుచున్నాడు.

**वे रोते हुए गाये** వారు ఏడ్చుచూ వెళ్లిరి.

**मैं ने उसे आपके साथ आते हुए देखा** నేను వానిని తమతో కూడ వచ్చుచుండగా చూచితిని.

2. ఇది విశేషణముగ గూడ వాడబడును.

ఉదా :—**चलती चक्की रुकती नहीं** తిరుగుచున్న తిరుగలి ఆగదు.

**सोते हुए सिंह को मत जगाओ** నిద్రించుచున్న సింహమును మేల్కొలుపవద్దు.

3. దీనిని రెండుమార్లుగూడ ఈ క్రింద విధమున నిత్య **ए** కారముతో నుపయోగింతురు. ఒక్కొక్కప్పుడు ఇది నిమగ్నతను తెల్పును.

ఉదా :—**वह बोलते २ थक गया** వాడు మాట్లాడుతూ మాట్లాడుతూ అలసిపోయెను.

**मैं जाते २ गिर पड़ा** నేను పోతూ పోతూ పడిపోతిని.

**मैं सुनते २ मुग्ध हो गया** నేను వింటూ వింటూ మైమరచి పోతిని.

**यह काम करते २ सारा दिन बीत गया** ఈ పని చేస్తూ చేస్తూ ఉండగా దినమంతయు గడిచిపోయెను.

సూచన :—వర్తమానకాలిక కృదంతమునకు **समय, वक्त, बार** చేర్చినపుడు కడపటి **'ता', 'ते'** మరియు **'ती'** అగును.

ఉదా :— **जाते समय** పోవునపుడు.

**लौटते वक्त** మరలునపుడు.

**फिरती बार** తిరిగివచ్చు పర్యాయము.

45. భూతకాలిక కృదంతము—

సామాన్య భూతకాలమునకు **आ, ए, ई** నియమము ననుసరించి **हुआ** చేర్చిన భూతకాలిక కృదంతమగును. తేలుచుగా సామాన్య భూతకాలిక

క్రియయే భూతకాలిక కృదంతమునకు మారుగ నుపయోగింపబడును. ఇదియే విశేషణముగ గూడ వాడబడును.

ఉదా :—खिला లేక खिला हुआ फूल వికసించిన పువ్వు.
सोयी లేక सोयी हुई औरत నిద్రించిన స్త్రీ.
पढ़ा-लिखा आदमी చదివిన మనుష్యుడు.
वह सोया हुआ है వాడు నిద్రించినవాడై యున్నాడు (నిద్రించుచున్నాడు).

46. పూర్వకాలిక కృదంతము (క్త్వార్థకము)—

ధాతువునకు कर చేర్చిన పూర్వకాలిక క్రియ ఏర్పడును.

(ఒక కర్తకే సంబంధించిన రెండు క్రియలున్న అందు మొదటి క్రియ సాధారణముగా పూర్వకాలిక కృదంతముగ నుండును.)

ఉదా :—खाकर తిని. सुनकर విని.
सोकर నిద్రించి. देखकर చూచి.
वह खाकर चला गया వాడు తిని వెళ్లిపోయెను.

సూచన :—1. సకర్మక క్రియలయొక్క పూర్వకాలిక కృదంతమునకు తర్వాత 'आना', 'जाना' అను క్రియారూపములు వచ్చునపుడు తఱచుగా कर లోపించును.

ఉదా :—सुन जाओ విని పొమ్ము. खा जाओ తిని పో.
देख आता है చూచి వచ్చుచున్నాడు. कर गया చేసి వెళ్లెను.

2. कर ధాతువునకు कर చేర్చునపుడు ప్రత్యయమగు कर వచ్చుటకు బదులు के వచ్చును.

ఉదా :—कर के చేసి.

47. నిత్యత్వబోధకము—

ఒక కార్యము నిరంతరము (అభ్యాసమువలె) చేయుచుండుటను తెల్పు క్రియ నిత్యత్వబోధకమనబడును. సామాన్యభూతకాల క్రియకు 'कर' చేర్చినచో యీ క్రియ యేర్పడును.

ఉదా :—आया कर వచ్చుచు ఉండుము. पढ़ा कर చదువుచు ఉండుము.
वह रोज़ यहाँ आया करता है వాడు నిత్యము ఇక్కడకు వచ్చుచు (ఉంటు) న్నాడు.

సూచన :—1. పోవుచూ ఉండు. जाया कर కాని गया कर కాదు.
2. దీని కర్తతో ఏకాలములోగూడ ने వాడబడదు.

ఉదా :—वह बहुत दिनों तक पढ़ा किया వాడు చాల రోజులవరకు చదువుచూ యుండెను.

| | |
|---|---|
| खड़ा నిల్చిన | खड़ा होना నిల్చుండుట |
| बीतना గడచుట | खोना పోగొట్టుట |
| चबाना నములుట | पचना జీర్ణమగుట |
| परवाह करना లక్ష్యముచేయుట | इज़्ज़त करना గౌరవించుట |
| दुनियाँ (స్త్రీ) ప్రపంచము | अन्न అన్నము. ధాన్యము |
| सबेरा ప్రాతఃకాలము | बूढ़ा ముసలి |
| अमीर ధనవంతమైన | ग़रीब బీద |
| ईमानदार నమ్మకమైన | बेईमान అవిశ్వాసపాత్రుడు |
| तन्दुरुस्ती (స్త్రీ) ఆరోగ్యము | किनारा ఒడ్డు समुद्र का किनारा సముద్రపు ఒడ్డు |

| | |
|---|---|
| मैंने कल आपको रामनाथ के साथ बातचीत करते देखा। | నేను నిన్న తమరిని రామనాథంతో మాట్లాడుచుండగా చూచితిని. |
| वे हँसते हुए कुछ कह रहे थे। | వారు నవ్వుచూ ఏమియో చెప్పుచుండిరి. |

| | |
|---|---|
| आपकी छोटी बहिन भी उनकी बात सुनती (हुई) वहाँ खड़ी थी। | మీ చెల్లెలుకూడ వారి మాటలు వినుచూ అక్కడ నిలిచియుండెను. |
| आज मैं उनके घर जाकर उनसे मिला। | నేను నేడు వారి యింటికి వెళ్లి వారిని కలిసికొంటిని. |
| वे मुझे देखकर बहुत ख़ुश हुए। | వారు నన్ను చూచి చాల సంతోషించిరి. |
| वह बूढ़ा आदमी अभी अपना काम करके बाहर गया है। | ఆ ముసలి మనుష్యుడు యిపుడే తన పని చేసికొని బయటికి వెళ్లెను. |
| जाओ, उसे एक बार देख आओ। | వెళ్లుము. ఆయనను ఒక సారి చూచి రమ్ము. |
| बीते हुए दिन कभी वापस नहीं आते। | గడచిన రోజులు ఎన్నడు మరల రావు. |
| यह काम कर जाओ। | ఈ పనిని చేసి వెళ్లుము. |
| ख़ूब चबाकर खाया हुआ अन्न जल्दी पचता है। | బాగుగ నమలి తినిన అన్నము త్వరగ జీర్ణమగును. |
| कही हुई बात को फिर कहना ठीक नहीं है। | చెప్పిన మాటలు తిరిగి చెప్పుట సరి గాదు. |
| दुनियाँ में जितनी चीज़ें हैं सब ईश्वर की दी हुई हैं। | ప్రపంచములోనున్న పదార్థములన్నియు ఈశ్వరుడిచ్చినవి. |
| तुम रोज़ सबेरे पाँच बजे उठा करो तो तुम्हारी तबीयत ठीक रहेगी। | మీరు రోజూ ప్రాతఃకాలమున ఐదు గంటలకు లేచుచుండినయెడల మీ ఆరోగ్యము చక్కగ నుండును. |
| आपके दोस्त कभी-कभी यहाँ आया करते हैं। | తమ మిత్రులు అప్పుడప్పుడు యిక్క-డికి వచ్చుచుందురు. |

| | |
|---|---|
| अमीर आदमी को सब लोग इज़्ज़त करते हैं; पर ग़रीब को कोई नहीं पूछता। | ధనికుని అందరు గౌరవించెదరుగాని పేదవాని (సంగతిని) నెవరును (అడుగరు) లక్ష్యము చేయరు. |
| इस दुनियाँ में इमानदार आदमी बहुत ज़्यादा मालूम होते हैं। | ఈ ప్రపంచములో విశ్వాసపాత్రులెక్కు-వగ కనుపించుచున్నారు. |
| वे कभी किसी बात की परवाह नहीं करते। | వారెన్నడును దేనినికూడ లక్ష్యము చేయరు. |
| सोये हुए सिंह को जगाना ठीक नहीं। | నిద్రించుచున్న సింహమును లేపుట మంచిదికాదు. |
| वे रोज़ बड़े सबेरे उठते और समुद्र पर टहलने जाते। | వారు ప్రతిదినము పెందలకడలేచి సముద్రతీరమునకు షికారుచేయుటకు వెళ్లుదురు. |

---

## పాఠము 20.

### సహాయక క్రియలు

48. **सक, चुक, दे, पा लग, चाह** యీ సహాయక క్రియలు ముఖ్య క్రియకు సహాయకములుగ నుపయోగింపబడును. కాలము, లింగము, వచనము మొదలైనవానివలన కలుగు మార్పులు సహాయక క్రియకే కల్గును. ముఖ్య క్రియలో నెట్టి మార్పును కలుగదు.

1. శక్తిబోధకము—

ధాతువునకు '**सक**' చేర్చినయెడల తెలుగున ధాతువునకు "వచ్చు", "కల" అను శబ్దములు చేర్చినట్లగును.

ఉదా :—मैं खा सकता हूँ నేను తినగలను.

वह क्या कर सकता है ? వాడేమి చేయగలడు ?

वे नहीं बोल सकगे వారు మాట్లాడలేరు.

तुम बोल सकते हो మీరు మాట్లాడగలరు ; మీరు మాట్లాడ వచ్చును.

कमला वहाँ नहीं जा सकी కమల అక్కడికి పోలేక పోయెను.

2. సమాప్తిబోధకము 'चुक'—

కార్యసమాప్తిని తెల్పుటకు ధాతువువెంట "चुक" చేర్పవలెను.

ఉదా :—वह पढ़ चुका వాడు చదివివేసెను.

मैं सो चुकी నేను నిద్రించి వైచితిని.

मैं कह चुका हूँ నేను చెప్పి వేసియున్నాను.

वे बोल चुके थे వారు మాట్లాడి వేసియుండిరి.

वे कर चुके होंगे వారు చేసి వేసియుందురు.

3. అనుమతి బోధకము 'दे' ఇచ్చు—

క్రియార్థకసంజ్ఞ (పాఠము 12 నియ. 22 చూడుము) యొక్క కడపటి 'ना' ను 'ने' గా మార్చి 'दे' ధాతువును కాలము కర్తయొక్క పురుష, లింగ వచనముల ననుసరించి చేర్పవలెను.

ఉదా :—(तुम) मुझे जाने दो నన్ను పోనిండు.

इसको बोलने दीजिये వానిని మాట్లాడనిండు.

मैं ने इसको जाने दिया నేను వానిని పోనిచ్చితిని.

4. అవకాశబోధకము 'पाना'—

ఇది 'सक' ఉపయోగింపబడు అర్థములో నుపయోగింపబడును కాని 'सक' అను క్రియ స్వకీయమైన అపశక్తతను 'पाना' అను క్రియ ఇతరులు అనుమతి నివ్వనందున కల్గిన యశక్తతను తెలియజేయును. ఇది

ధాతురూపముతోను, క్రియార్థక సంజ్ఞతోను ఉపయోగింపబడును. కాల, పురుష సంబంధమగు మార్పులు దీనికే కలుగును.

ఉదా :—कर पाना లేక करने पाना చేయగలుగుట.

मैं वहाँ नहीं जा पाया లేక जाने पाया నేను పోజాలక పోతిని.

तुम नहीं सुन पाओगे లేక सुनने पाओगे నీవు వినజాలవు.

5. ఆరంభబోధకము 'लग'—

ఇది మార్పుజెందిన క్రియార్థక సంజ్ఞతో నుపయోగింపబడును. కాలము, పురుష మొదలగువానివలన చేయబడు మార్పులన్నియు దీనికే కల్గును. ముఖ్య క్రియలో నెట్టి వికృతియు కలుగదు.

ఉదా :—मैं बोलने लगा నేను మాట్లాడ సాగితిని.

प्रमीला सोने लगी ప్రమీల నిద్రపోసాగెను.

हम देखने लगे మేము చూడ సాగితిమి.

6. ఇచ్ఛాబోధకము 'चाह' కోరు—

ఇది సామాన్య క్రియార్థక సంజ్ఞకు చేర్చబడును. మార్పులన్నియు దీనికే కలుగును.

ఉదా :—मैं जाना चाहता हूँ నేను వెళ్లగోరుచున్నాను.

तुम क्या करना चाहते हो మీరేమి చేయ గోరుచున్నారు.

मैं ने हिन्दी सीखनी चाही నేను హిందీ నేర్చుకొన గోరితిని.

49. అనుమతిబోధకమగు 'दे' ఇచ్ఛాబోధకమగు 'चाह' ఇవి రెండును భూతకాలములో నుపయోగింపబడినపుడు ముఖ్య క్రియ సకర్మక మైనను, కాకపోయినను గూడ కర్తతో 'ने' చేర్చవలయును.

ఉదా :—मैंने उसे जाने दिया నేను వానిని పోనిచ్చితిని.

उसने सोना चाहा వాడు నిద్రింప గోరెను.

సూచన :—పై వాక్యములలో ముఖ్య క్రియలు **'जाना'**, **'सोना'**, రెండును అకర్మకములైనను కర్తతో **'ने'**, యున్నది.

| | |
|---|---|
| **झगड़ा** జగడము | **लड़ाई** (స్త్రీ.) జగడము, యుద్ధము |
| **ख़याल** భావము, యోచన | **गाड़ी** (స్త్రీ.) బండి [సౌకర్యము |
| **चोर** దొంగ | **सवारी** (స్త్రీ.) వాహనము, ప్రయాణ |
| **रिश्तेदार** బంధువులు | **जायदाद** (స్త్రీ.) ఆస్తి |
| **माता, माँ** తల్లి | **पिता, बाप** తండ్రి |
| **हफ़्ता** వారము | **ग़ौर** ధ్యానము |
| **दफ़ा, बार** సారి | **दर्शन** దర్శనము |
| **जीतना** జయించుట | **ज़ब्त होना** జప్తు అగుట |
| **भागना** పరుగెత్తిపోవుట | **वसूल करना** వసూలుచేయుట |
| **पिछला** వెనుకటి, గడచిన | **सारा** యావత్తు |

**ग़ौर करना** తదేక దృష్టితో

| | |
|---|---|
| क्या अब आप हिन्दी समझ सकते हैं? | ఇప్పుడు తమరు హిందీ అర్థము చేసుకొనగలరా? |
| हाँ, अब मैं थोड़ी-थोड़ी हिन्दी समझ सकता हूँ। | ఔను, ఇప్పుడు నేను కొంచెము కొంచెముగా హిందీ తెలిసికొనగలను. |
| जो काम दस आदमी मिलकर नहीं कर सकते, उसे वह अकेले कर सकता है। | పదిమంది కలిసి చేయజాలని పనిని అతనొక్కడే చేయగలడు. |
| पिछली लड़ाई में जर्मनी नहीं जीत सका। | వెనకటి యుద్ధములో జర్మనీ జయించలేక పోయెను. |
| वे अपना काम कर चुके। | వారు తమ పనిని చేసివేసిరి. |
| जब हम गाड़ी में बैठ चुके, तब 'फक, फक' करती हुई गाड़ी रवाना हुई। | మేము బండిలో కూర్చున్న పిదప "ఫక్ ఫక్" అనుచూ బండి బయలుదేరెను. |

| हिन्दी | తెలుగు |
|---|---|
| मेरा ख़याल है कि अब तक आपके रिश्तेदार कलकत्ते पहुँच चुके होंगे। | ఇప్పటికి మీ బంధువులు కలకత్తా చేరి యుందురని నా యభిప్రాయము. |
| वहाँ पहुँचने पर मैंने सुना कि उनकी सारी जायदाद ज़ब्त हो चुकी है। | ఆయన ఆస్తియంతయు జప్తు అయి పోయినదని నేను అక్కడికి చేరిన మీదట వింటిని. |
| विद्यार्थी ने मास्टर से कहा, "मुझे दो हफ़्ते के लिये घर जाने दीजिये।" | విద్యార్థి యుపాధ్యాయునితో "నన్ను రెండువారములు యింటికి పోనిండు" అని చెప్పెను. |
| बहुत कोशिश करने पर भी पुलिस ने चोरों को भागने नहीं दिया। | చాల ప్రయత్నించినప్పటికీ పోలీసులు దొంగలను పాటిపోనివ్వలేదు. |
| छोटे बच्चे जब बोलने लगते हैं, तब उनके माता-पिता उनकी बात सुनकर बहुत ख़ुश होते हैं। | చిన్న బిడ్డలు మాట్లాడ ఆరంభించి నపుడు వారి తల్లిదండ్రులు వారిని జూచి చాల సంతోషించెదరు. |
| जब वह मेरी ओर ग़ौर से देखने लगा तब मैंने उससे पूछा — तुम क्या कहना चाहते हो? | వారు నావైపు తేరి పారచూడ సాగగా. "నీవేమి చెప్ప గోరుచున్నా" వని నేను వాని నడిగితిని. |
| उसने जवाब दिया—मैं कुछ नहीं चाहता। | నేనేమియు కోరుట లేదని వాడు బదులు చెప్పెను. |
| मैंने एक बार वहाँ जाकर उनका दर्शन करना चाहा, पर समय नहीं पा सका। | నేను ఒకసారి అక్కడికి వెళ్లి వారిని సందర్శించగోరితిని కాని అవకాశ ము పొంద లేక పోతిని. |
| अगर पानी बरसने लगेगा तो मैं वहाँ नहीं जा पाऊँगा। | వర్షము కురియ సాగినచో నేనక్కడికి పోజాలను. |

| | |
|---|---|
| अगर मैं उसे देख पाता तो अपने सारे रुपये उससे वसूल करता। | నేను వానిని చూడగలిగియుండినచో (చూచుట తటస్థించియుండినచో) నా రూపాయలనన్నింటిని వసూలు చేసి (కొని) యుందును. |
| आज तुम वहाँ किसी तरह न जाने पाओगे। | నేడు మీరు అక్కడికి ఎవ్విధమునను పోజాలరు. |
| इस बाज़ार में सब दूकानदार सिर्फ़ स्वदेशी कपड़े बेचते हैं। | ఈ బజారులో దుకాణదారులందరు కేవలము స్వదేశీ వస్త్రములనే అమ్ముదురు. |

---

## పాఠము 21.

### సంయుక్త క్రియలు

50. ఒక క్రియయొక్క అర్థములో విశేషతను గనుపరచుటకు దానికి మరొక క్రియను చేర్చిన సంయుక్త క్రియయగును. ఇందు మొదటి క్రియ ధాతురూపముననే యుండును. కాలము మొదలగువానివలన క్రియకు కలుగు మార్పులన్నియు రెండవదియగు సహాయక క్రియకే కల్గును.

హిందీలో నీ సంయుక్త క్రియలు విశేషముగ వాడబడును. కొన్ని సందర్భములలో సహాయక క్రియ తన సహజార్థమును గోలుపోయి మొదటి వానితో పూర్తిగ కలిసిపోవుటయు కలదు.

51. సాధారణముగా **जाना, देना, लेना, डालना, पड़ना, उठना, बैठना, छोड़ना, रखना** మొదలగునవి (ముఖ్య క్రియ తర్వాత) సహాయక క్రియలుగ నుపయోగింపబడును.

1. (అ) '**जाना**' అను క్రియ కార్య సమాప్తిని తెలుపుటకు సహాయక క్రియగా ముఖ్య క్రియా ధాతువునకు చేర్చబడును.

ఉదా :—आ जाना వచ్చివేయుట. सो जाना నిద్రపోవుట. हो जाना అయిపోవుట. मर जाना చనిపోవుట. खा जाना తినిపోవుట. घबरा जाना కంగారు పడిపోవుట. भूल जाना మరచిపోవుట. ले जाना తీసికొని పోవుట. जान जाना తెలిసికొనుట. मिल जाना కలిసిపోవుట.

(అ) కాని **चला जाना, चला आना** వెళ్ళిపోవుట అనునది పై నియమము ననుసరింపదు; ఇందు రెండు క్రియలుగూడ లింగవచనముల ననుసరించి మారుచుండును.

ఉదా :—चला आता (పు. ఏ.) चले आयें (పు. బ.)
चली आयी (స్త్రీ. ఏ.) चली आयीं (స్త్రీ. బ.)
चला गया (పు. ఏ.) चले गये (పు. బ.)
चली गयी (స్త్రీ. ఏ.) चली गयीं (స్త్రీ. బ.)

2. **लेना, देना** ఇవి సహాయక క్రియలుగా నుపయోగింపబడునపుడు కూడ తమ యర్థమునే కలిగియుండును. **लेना** తెలుగునందలి "కొను" వలె ఆత్మనేపదియందు ప్రయోగింపబడును అనగా ఆ క్రియాఫలము కర్తకే చెందును. **देना** "యిచ్చు" ఇది పరస్మైపదియందు ఉపయోగింపబడును. ఇందు క్రియాఫలము "కర్మకు" చెందును.

ఉదా :—वह अपना काम आप कर लेता है వాడు తన పనిని (తానే) చేసుకొనున్నాడు.

तुम यह गीत लिख लो నీవు యీ పాటను వ్రాసికొనుము.

तुम मुझे यह गीत लिख दो నీవు నాకు యీ పాటను వ్రాసియిమ్ము.

मैं यह किताब अपने लिए खरीद लेता हूँ నేను యీ పుస్తకము నా కొరకు కొనుక్కొనెదను.

मैं यह क़लम तुम्हारे लिए ख़रीद देता हूँ నేను ఈ కలమును నీకు కొని ఇచ్చెదను.

दे देना ఇచ్చివేయుట
खो देना పోగొట్టి వేయుట
कह देना చెప్పివేయుట
गिरा देना పడవేయుట
डाल देना వేసివేయుట
भेज देना పంపివేయుట
चल देना వెడలిపోవుట
छोड़ देना వదలివేయుట
लौटा देना తిరిగి ఇచ్చివేయుట
खिला देना తినిపించుట
जला देना కాల్చివేయుట

ले लेना తీసికొనుట
सुन लेना వినుట
मान लेना ఒప్పుకొనుట
छीन लेना లాగుకొనుట
पकड़ लेना పట్టుకొనుట
पहचान लेना గుర్తించుట
समझ लेना తెలిసికొనుట
मिटा देना రూపుమాపుట
लौटा लेना తిరిగి తీసికొనుట
लूट लेना దోచుకొనుట
बना लेना సరిజేయుట

हटा देना తొలగించు

3. నిశ్చయబోధకమగు "डालना" తెలుగున ధాతువునకు 'వేయు' చేర్చినట్లు చేర్చబడును.

ఉదా :—मार डालना చంపివేయుట
उखाड़ डालना పెల్లగించివేయుట
तोड़ डालना విరిచివేయుట
काट डालना కోసివేయుట
दे डालना ఇచ్చివేయుట (दे देना)
खा डालना తిని వేయుట (खा जाना)

4. (అ) అకస్మికబోధకము (पड़ना) క్రియార్థమందలి ఆకస్మికమును దెలుపును.

ఉదా :—गिर पड़ना (హఠాత్తుగ) పడిపోవుట
चौंक पड़ना ఉలికిపడుట
निकल पड़ना (అకస్మాత్తుగ) బయలుదేరుట

(అ) "**पड़ना**" తెలుగులో 'వినబడు', 'కనబడు', మొదలగు వానితోవలె కొన్ని యింద్రియ వ్యాపారములను సూచించుటను రెండవ క్రియగా గూడ నుపయోగింపబడును.

ఉదా:—**देख पड़ना** కనబడుట  **जान पड़ना** ఎరుగబడుట (తోచుట)
**समझ पड़ना** తెలియబడుట **सुन पड़ना** వినబడుట

5. '**उठना**' ఆకస్మికతాబోధకము. ఏదైనను కార్యము హఠాత్తుగ జరిగినచో దానిని తెలుపుటకు **उठना** రెండవ క్రియగా చేర్చబడును.

ఉదా:—**बोल उठना** } (హఠాత్తుగ) మాట్లాడుట
**कह उठना** }
**जाग उठना** (హఠాత్తుగ) మేల్కొనుట
**चिल्ला उठना** (హఠాత్తుగ) కేకవేయుట
**चौंक उठना** ఉలికిపడుట  **कांप उठना** వణకుట

6. **बठना** ఇదియు '**उठ**' వలె అనాలోచితముగ జరిగిన వ్యాపారమందలి శీఘ్రతను దెల్పును.

ఉదా:—**मार बैठना** కొట్టివేయుట  **पूछ बैठना** అడిగివేయుట
**बिगड़ बैठना** కోపపడుట  **कर बैठना** చేసివేయుట

7. విచ్ఛేదార్థకమందు **छोड़ना** సంరక్షార్థమందు **रखना** యను క్రియాధాతువులతో నుపయోగింపబడును.

ఉదా:—**रख छोड़ना** ఉంచుట, పెట్టి ఉంచుట
**कर छोड़ना** చేసివేయుట
**कह रखना** చెప్పియుంచుట
**रोक रखना** ఆపియుంచుట

52. సహాయక క్రియ సకర్మకముగనున్న సంయుక్త క్రియకు కర్తతో '**ने**' వచ్చును.

सूरज సూర్యుడు
तारा నక్షత్రము
आसमान ఆకాశము
दर्ज़ी దర్జీవాడు
बिस्तर పరక
मिज़ाज ఆరోగ్యము, స్వభావము
नौकर సేవకుడు
मुसाफ़िर ప్రయాణికుడు
चिन्ता करना వ్యాకులపడుట
तोड़ना విరుగగొట్టుట
रखना ఉంచుట
छोड़ना వదలుట
दूर होना తొలగుట
साफ़ साफ़ శుభ్రముగ, విశదముగ

चाँद చంద్రుడు
अँधेरा చీకటి
ज़मीन నేల
कुर्ता చొక్కా
छड़ी (స్త్రీ.) బెత్తము
कर्ज़ అప్పు
मुसाफ़िरखाना రహదారి బంగళా
व्यापार వ్యాపారము, వర్తకము
अदा करना చెల్లించుట
मारना కొట్టుట
चौंकना ఉలిక పడుట
सीना కుట్టుట
दूर करना తొలగించుట [మ్మడి-
एकदम పూర్తిగా, సరాసరి, ఒక్కు-

छः बज गये, सूरज निकल आया, अंधेरा दूर हो गया, चलो, अब अपना काम करने चलें।

ఆరు కొట్టినది, సూర్యుడుదయించినాడు. చీకటి (తొలగి) పోయినది. పద (ఇప్పుడు) ఇక మన పని చేసుకొనుటకు వెళ్లుదము.

तुम्हें वहाँ कोई तकलीफ़ हो तो मेरे घर चले आओ।

మీకు అక్కడ ఏదైన కష్టముగ నుండుచో మీరు మా యింటికి వచ్చి వేయండి.

मैं तुम्हारी बातें सुनकर एकदम घबड़ा गया।

నేను మీ మాటలు విని చాలా (పూర్తిగా) కంగారు పడిపోతిని.

मैंने उनको तुम्हारे बारे में कुछ नहीं बताया, लेकिन वे सब बातें ख़ुद जान गये।

నేను వారితో మిమ్మునుగూర్చి ఏమియు చెప్పలేదు, కాని వారన్ని సంగతులు స్వయముగానే తెలిసికొనిరి.

| | |
|---|---|
| कल तुम्हारी बहिन का मिज़ाज़ ठीक नहीं था, डाक्टर उसे देख गये थे। | నిన్న మీ సోదరి యారోగ్యము బాగుగా నుండలేదు. డాక్టరు ఆమెను చూచి వెళ్లియుండెను. |
| तुम आपना बिस्तर कब ले गये? | మీరు మీ పడక నెప్పుడు తీసికొని వెళ్లితిరి? |
| वह अपना काम करके चला गया। | వాడు తన పనిని చేసి వెళ్లిపోయెను. |
| मैं ने उसका सब कर्ज़ अदा कर दिये हैं। | నేను వాని అప్పులన్ని తీర్చివేసితిని. |
| दर्जी ने मेरे दो कुर्ते सी दिये। | దర్జీవాడు నా చొక్కాలు రెండు కుట్టి వేసినాడు. |
| राम का नौकर मेरे बहुत काम कर देता है। | రాముని నౌకరు నాకు చాల పనులు చేసిపెట్టును. |
| उन्होंने अपनी घड़ी ले ली। | వారు తమ గడియారము తీసికొనిరి. |
| तुम चिन्ता मत करो; मैं यह काम खुद कर लूंगा। | మీరేమియు వ్యాకులపడకండి. నేను యీ పనిని స్వయముగ చేసికొందును. |
| कुछ चोरों ने मिलकर दो मुसाफिरों को मार डाला। | కొందరు దొంగలు కలసి యిరువురు ప్రయాణికులను చంపివేసిరి. |
| उस शैतान लड़के ने मेरी छड़ी तोड़ डाली। | ఆ తుంటరి పిల్లవాడు నా బెత్తమును విరుగ గొట్టినాడు. |
| मैं उस बूढ़े आदमी को देखकर एकदम चौंक पड़ा। | నేను ఆ ముసలివానిని చూచి ఒక్క పెట్టున త్రుళ్లి పడితిని. |
| देखो, आसमान में तारे देख पड़ते हैं। | చూడుము. ఆకాశమున నక్షత్రములు కనుపించుచున్నవి. |
| वे बूढ़े हो गये हैं, इसलिये उन्हें साफ़ साफ़ सुन नहीं पड़ता। | వారు ముసలివారైరి కావున వారికి స్పష్టముగ వినబడుట లేదు. |

| | |
|---|---|
| मुझे जान पड़ा कि वह इस देश का आदमी नहीं है। | అతడు ఈ దేశపు మనుష్యుడు కాడని నాకు తెలిసెను. |
| वह मुझे बिना क़सूर मार बैठा। | తప్పులేనిదే వాడు నన్ను కొట్టియున్నాడు. |
| हम ने तुमसे कुछ नहीं पूछा, तुम क्यों बोल उठे? | మేము మిమ్మేమియు అడుగలేదు. మీ రెందుకు మాట్లాడితిరి? |
| मैंने आपके लिये बीस आम रख छोड़े हैं। | నేను తమకొఱకు ఇరువది మామిడి పండ్లు ఉంచియున్నాను. |
| इस व्यापार में उसने बहुत से रुपये कमा रखे। | ఈ వ్యాపారమునందాతడు చాల డబ్బు చేస్కొనెను. |

---

## పాఠము 22.

### క్రియలు (తరువాయి)

53. సామాన్య భూతకాల రూపముతో ఇచ్ఛాబోధకమగు **"चाह"** చేర్చిన కార్యమాసన్నమై యున్నదని తెలియును.

ఉదా :—वह खाया चाहता है వాడు (వెంటనే) ఇప్పుడే భోజనముచేయ గోరుచున్నాడు (వాడు తినపోవుచున్నాడు).

वह आया चाहता है వాడు రాబోవుచున్నాడు.

वह मरा चाहता है వాడు మరిణించుచున్నాడు (వానికి మృత్యువు ఆసన్నమైనది.)

54. **लेना, देना, डालना** ఇవి సామాన్య భూతకాల బహువచన రూపముతో చేర్చిన "వెంటనే" అను నర్థము నిచ్చును.

ఉదా :—खाये लेना (వెంటనే) తినివేయుట.

कहे देना (వెంటనే) చెప్పివేయుట.

किये डालना (వెంటనే) చేసివేయుట.

55. **रहना, जाना** ఇవి వర్తమానకాలిక కృదంతముతో నుపయోగించిన తత్పరతా బోధకములగును.

ఉదా :—वह गाता रहता है
वह गाते रहता है } వాడు పాడుచు ఉంటున్నాడు.

वह गाता जाता है
वह गाते जाता है } వాడు పాడుచు పోవుచున్నాడు.

मैं बोलता जाता हूँ तुम लिखते जाओ నేను చెప్పుచు పోయెదను (ఉండెదను). నీవు వ్రాయుచు (పొమ్ము) ఉండుము.

56. **करने से, खाने से, पढ़ने से** మొదలగువానికి బదులు ఆ ధాతువుల సామాన్య భూతకాల పుంలింగ బహువచన రూపముకూడ వాడబడును.

ఉదా :—तुम्हारे किये कुछ न होगा = तुम्हारे करने से कुछ न होगा
నీవు చేయుటచే నేమియుకాదు (నీవల్ల నేమియుకాదు).
बिना गये कुछ न मिलेगा = न जाने से कुछ न मिलेगा
పోవిచో నేమియు దొరకదు.

57. క్రియార్థక సంజ్ఞయొక్క కడపటి '**आ**' ను '**ए**' చేసి షష్ఠీ విభక్తి ప్రత్యయము కలిసినచో విశేషణమగును.

ఉదా :—सोने का कमरा నిద్రపోవు గది  पीने का पानी త్రాగు నీరు
लिखने का काग़ज़ వ్రాయు కాగితము.

58. సామాన్య వర్తమానకాలము నే తద్ధర్మకాలముగా వాడుదురు.
ఉదా :—वह गाता है వాడు పాడుచున్నాడు. వాడు పాడును.

59. మర్యాదార్థక (आप కర్తగాగల) విధ్యర్థక రూపమునకు '**गा**' చేర్చిన ఎక్కువ మర్యాదను, భవిష్యత్కాలమును రెంటిని తెల్పును. రెండు సందర్భములలోను '**आप**' కర్తగా నుండును.

ఉదా :—आप कल जाइयेगा తమరు దయచేసి రేపు వెళ్లండి.

आप उत्तर हिन्दुस्तान में जाइयेगा तो हिन्दी ज़रूर सीखियेगा। మీరు ఉత్తర హిందూస్థానమునకు వెళ్లినచో హిందీ తప్పక నేర్చుకొనుడు.

60. **जाइयो, खाइयो, दीजियो, लीजियो** యెందలగునవి భవిష్యదర్థమున '**तुम**' కర్తగనుండునపుడు ఉపయోగింపబడును.

ఉదా :– तुम उनके साथ जाइयो మీరు వానితోకూడ వెళ్లుడు.

यह पुस्तक उनको दीजियो ఈ పుస్తకము వారికి యియ్యుడు.

61. **आँख से देखना, कान से सुनना, भूख से मरना** యెందలగువానికి బదులు **आँखों देखना, कानों सुनना, भूखों मरना** కూడ వాడబడును.

| | |
|---|---|
| **भेद** రహస్యము | **नतीजा** పరిణామము |
| **आन्दोलन** ఉద్యమము | **स्वर्ग** స్వర్గము |
| **मन्दिर** దేవాలయము | **साफ़ साफ़** విశదముగ |
| **चालाकी** చాతుర్యము | **बेवक़ूफ़ी** తెలివిలేనితనము |
| **गिरफ़्तार करना** అరెస్టుచేయుట | **तंग आना** విసుగుచెందుట |
| **ठगाना** మోసగించుట | **मरना** చచ్చుట |

| | |
|---|---|
| मैं यह किताब लिये लेता हूँ। | నేను ఈ పుస్తకమును (ఇపుడే) తీసికొనుచున్నాను. |
| वह मेरा सब भेद दूसरों से कहे डालता है। | అతడు నా రహస్యమునంతయు ఇతరులకు చెప్పివేయుచున్నాడు. |
| क्यों इस ग़रीब को मारे डालते हो? | ఈ దీనుని ఎందుకు చంపివేయుచున్నారు? |
| गाड़ी स्टेशन पर पहुँचा चाहती है। | బండి స్టేషనుకు చేర బోవుచున్నది. |

| | |
|---|---|
| जल्दी करो, पानी पड़ा चाहता है। | త్వరపడుడు. వర్షము కురియబోవు చున్నది. |
| वे एक दो दिन में यहाँ आया चाहते हैं। | వారు రెండు మూడు రోజులలో ఇచ్చ టకు రాబోవుచున్నారు. |
| वह मुझे ठगा चाहता था कि इतने में पुलिस ने आकर उसको गिरफ़्तार कर लिया। | వాడు నన్ను మోసగించ బోవుచుండెను. ఇంతలో పోలీసులు వచ్చి వానిని అరెస్టుచేసిరి. |
| वह तमाम दिन काम करता रहता है। | వాడు దినమంతయు పని చేయుచుం డును. |
| तुम पढ़ते जाओ, मैं सुन रहा हूँ। | నీవు చదువుచు పొమ్ము. నేను వినుచు న్నాను. |
| हमारे मनाये वह न मानेगा। | మేము బ్రతిమాలినను వాడు ఒప్పు కొనడు. |
| उसके खाये हमारा पेट न भरेगा। | వాడు తినుటవల్ల మనపొట్ట నిండదు. |
| बिना मरे स्वर्ग नहीं मिलेगा। | చావనిదే స్వర్గము దొరకదు. |
| वह अपने घर में भी भूखों मरता है। | వాడు తన యింటిలోకూడ పస్తుపడి యుండును. |
| आँखों देखी बात तुम झूठी कह रहे हो। | కండ్లతో జూచిన విషయమును మీరు అసత్యమనుచున్నారు. |
| आप दस वर्ष के बाद देखियेगा कि इस आन्दोलन का क्या नतीजा होता है। | ఈ యుద్యమ ఫలితము ఏమగునో పది సంవత్సరములైన తర్వాత (చూచె దరు) చూడండి. |
| आप काशी जाइयेगा तो विश्वनाथ जी का मंदिर ज़रूर देखियेगा। | తమరు కాశీకి వెళ్లితే విశ్వనాథుని దేవా లయమును తప్పక చూడండి. |

| | |
|---|---|
| लिखने की मेज़ उस कमरे में रखो। | వ్రాతబల్లను ఆ గదిలోనుంచుము. |
| यह सोचने की बात है; भुला देने की नहीं। | ఇది ఆలోచించవలసిన విషయము, మరచిపోదగినది కాదు. |
| जल्दी करो, निकलने का समय हो गया। | త్వరపడుడు, బయలుదేరు సమయమైనది. |
| वहाँ पीने का पानी भी नहीं मिलता। | అచ్చట త్రాగుటకు నీళ్లుకూడ దొరకవు. |
| वह उनके लिखने की क़लम थी, टूट गयी। | అది ఆయన వ్రాసెడి కలము, విరిగిపోయినది. |
| मैं आपसे मिलकर बहुत खुश हुआ। | నేను మిమ్ములను దర్శించి (కలియుటచే) చాల సంతసించితిని. |
| वे दस रोज़ से यहाँ बिलकुल नहीं आये। | వారు పదిరోజులనుండి యిక్కడకు బొత్తిగా రాలేదు. |
| मैं तुम्हारी तमाम चालाकी समझ गया। | నేను నీ చాతుర్యమంతయు తెలిసికొంటిని. |
| मैं तुम्हारी बेवक़ूफ़ी से तंग आ गया हूँ। | నేను నీ తెలివితక్కువవల్ల చాల విసిగితిని, |
| समझकर बात करो। | తెలిసికొని మాట్లాడుము. |
| तुम उसके साथ मत जाइयो। | మీ రాతనితో కూడ వెళ్లకుడు. |
| उनसे सब बातें कहिये। | వానికి అన్ని సంగతులు చెప్పుడు. |
| वह दूध नहीं पीता, काफ़ी पीता है। | వాడు పాలు త్రాగడు, కాఫీ త్రాగును. |

## పాఠము 23.

### ही ప్రయోగములు

62. 'ही' 'మాత్రమే' 'ఏ' ఇది ఏకార్థక మందు వచ్చును. హిందీలో ననేకవిధములుగ దీని నుపయోగింతురు.

1. సాధారణముగ 'ही' ప్రత్యేకత్వమును సూచించుటకు 'కేవలము' 'మాత్రము' 'ఏ' అను నర్థములో వచ్చును.

ఉదా :—मैं ही నేను మాత్రమే (నేనే)
एक ही ఒకరు మాత్రమే (ఒకరే)

సర్వనామములు ही అను అవ్యయముతో వచ్చునపుడు అది వానితో కలిసిపోవును.

तुम + ही = तुम्हीं మీరే — वह + ही = वही అతడే, అదియే
हम + ही = हमीं మనమే, మేమే — यह + ही = यहीं ఇతడే, ఇదియే
उस + ही = उसी అదియే — उन + ही = उन्हीं అవియే
इस + ही = इसी ఇదియే — इन + ही = इन्हीं ఇవియే
सब + ही = सभी అందరున్ను — अब + ही = अभी ఇప్పుడే
तब + ही = तभी అప్పుడే — कब + ही कभी ఎప్పుడైనను
यहाँ + ही = यहीं ఇచ్చటనే — वहाँ + ही = वहीं అచ్చటనే
कहां + ही = कहीं ఎక్కడనైనను — किस + ही = किसी ఏదైనను

2. వర్తమానార్థక కృదంతములో 'ही' చేర్చినపుడు 'తక్షణమే' అనునర్థము నొసంగును.

ఉదా :—मेरे पहुँचते ही वह चला गया నేను చేరగనే (చేరిన తక్షణమే) వాడు వెడలిపోయెను.

उसके आते ही मैं चुप हो गया వాడు రాగానే నేను ఊరకుంటిని.

3. ఏకాలమునం దైనను క్రియతో నుపయోగించిన ఆ కార్యమును దృఢపరచును.

ఉదా :—**मैं गया ही** నేను పోయి తీరితిని.

**वे जायेंगे ही** వారు తప్పక పోయెదరు.

4. **ही** తరువాత సంబంధ సర్వనామము వచ్చినచో 'ఆ' అను అర్థము నిచ్చును.

ఉదా :—**यह वही आदमी है जिसे तुमने कल देखा** (ఇతను ఆ మని షియే ఎవరి నైతే నీవు నిన్న చూచియుంటివో) నీవు నిన్న చూచి నటువంటి మనిషి ఇతడే.

6. ప్రధాన సహాయక క్రియల మధ్యన **ही** వచ్చిన ఈ క్రింది విధ ముగా అర్థముండును.

ఉదా :—**जा ही रहा था** వెళ్లుచునే యుండెను.

**देख ही लेता था** చూచుకొనుచునే యుండెను.

**गरमी** (స్త్రీ.) వేసవికాలము

**बरसात** (స్త్రీ.) వర్షకాలము

**पहाड़** పర్వతము

**मुँह** నోరు

**अंग्रेज़** ఆంగ్లేయులు

**अंग्रेज़ी** ఆంగ్లభాష

**संतान** (స్త్రీ.) బిడ్డలు

**मनुष्य** మనుష్యుడు

**टोपी** (స్త్రీ.) టోపి

**उड़** ఎగురు

**कम** తక్కువ

**खुलना** (రైలు మొ) బయలుదేరుట

**जाड़ा** చలికాలము

**मौसिम** ఋతువు

**बरफ़** (స్త్రీ.) మంచు

**वाक्य** వాక్యము

**अछूत** అస్పృశ్యుడు

**मतलब** తాత్పర్యము, ఉద్దేశ్యము

**पक्षी** (పుం.) **चिड़िया** (స్త్రీ.) పక్షి

**सीना** కుట్టుట

**पैदा होना** జన్మించుట

**ज़्यादा** అధికము

**रोकना** ఆపుట

**तो भी** అయినప్పటికిని

**बल्कि** మీద, మిక్కిలి

| | |
|---|---|
| आप ही का नाम रामदास जी है? | తమ పేరేనా రామదాసుగారు? |
| जी हाँ, मेरा ही नाम है। | అవునండి, నా పేరే. |
| आप आजकल यहीं—इसी शहर में—रहते हैं? | తమరు ప్రస్తుతము ఇచ్చటనే—ఈ పట్టణమందే—యున్నారా? |
| हाँ, मैं करीब छः महीने से यहीं रहता हूँ। | అవును. సుమారు ఆరు మాసముల నుండి యిచ్చటనే ఉంటున్నాను. |
| गरमी के मौसिम में सभी लोग पहाड़ों पर जाकर रहते हैं। | వేసవికాలములో నందరు పర్వతముల మీదకు వెళ్లియుండెదరు. |
| जाड़े में कहीं कहीं बरफ़ भी गिरती है। | చలికాలములో కొన్నిచోట్ల మంచుకూడ పడును. |
| मैं अपने को किसी तरह उनसे कम मज़बूत नहीं समझता। | నన్ను నేనే విధముగాను వారికన్న తక్కువ బలముగలవానివిగా తలం పను. |
| वह आजकल उसी मकान में रहता है, जिसमें मैं दो वर्ष पहले रहता था। | రెండు సంవత్సరములవెనుక ఉన్న యింటిలోనే ప్రస్తుతము అయన నివ సించుచున్నారు. |
| मेरा ख़याल है कि वे दस दिन के अंदर ही लौट आवेंगे। | వారు పదిరోజుల లోపలనే తిరిగి వచ్చె దరని నా యభిప్రాయము. |
| मेरे स्टेशन पर पहुँचते ही गाड़ी खुल गयी। | నేను స్టేషనునకు చేరగనే బండి కద లెను. |
| उसके मुहँ से बात निकलते ही मैंने उसे रोक दिया। | వాని నోటినుండి మాట వెడలగనే నేను వానిని ఆపితిని. |
| अगर अंग्रेज़ हिन्दुस्तान में न आते तो हमारी हालत कुछ और ही होती। | ఆంగ్లేయులు భారతదేశమునకు రాకుండి నచో మన స్థితి మతొకవిధముగా నుండెడిది. |

इस वाक्य का मतलब वह नहीं है जो तुम समझते हो, बल्कि कुछ और ही है।

ఈ వాక్యముయొక్క అర్థము నీవు అనుకునునదికాదు. మఱొకటి.

यह काम ही वह नहीं कर सकता, तुम उसे ज़्यादा काम क्यों देते हो?

ఈ పనినే వాడు చేయజాలకున్నాడు. మీరు వానికి యెక్కువపనిని యేల యిచ్చెదరు?

यह वही घर है जिसमें मैं कई वर्ष पहले आया करता था।

అనేక సంవత్సరముల క్రిందట నేను వచ్చియున్న యిల్లే యిది.

अछूत भी उसी ईश्वर की सन्तान हैं जिसकी संतान ब्राह्मण हैं।

బ్రాహ్మణులు ఏ ఈశ్వరుని బిడ్డలో అస్పృశ్యులుగూడ నాతని బిడ్డలే.

मैंने उसे बहुत मना किया, तो भी वह लड़ाई पर गया ही।

నేను వాని నెంత వద్దని చెప్పినను వాడు యుద్ధమునకు పోనే పోయినాడు.

तुम आओ या नहीं, मैं जाऊँगा ही।

నీవు వచ్చినను రాకున్నను నేను పోక తప్పదు (పోయితీరెదను).

मेरी यह टोपी उसी दर्ज़ी ने सी दी है जो तुम्हारे कपड़े सीता है।

నీ బట్టలు కుట్టు దర్జీయే యీ నా టోపీ కుట్టి ఇచ్చినది.

पक्षी ही उड़ सकते हैं, मनुष्य उड़ नहीं सकते।

పక్షులే ఎగురగలవు. మనుష్యులు ఎగురలేరు.

यह वही देश है जिसमें राम और कृष्ण पैदा हुए थे।

రామకృష్ణులు జన్మించిన దేశమిదియే.

ईश्वरचन्द्र विद्यासागर हमेशा सादे कपड़े ही पहनते थे।

ఈశ్వరచంద్ర విద్యాసాగరులవారు, ఎల్లప్పుడును సామాన్య వస్త్రములచే ధరించెడివారు.

## పాఠము 24.

### ఆవశ్యకతాబోధకములు

63. బలవంతముచే పరాధీనతచే నొక కార్య మొనర్పవలసి వచ్చు నప్పుడు క్రియార్థక సంజ్ఞకు (పాఠ 21) **पड़ना**' చేర్చవలయును.

అట్టి క్రియయొక్క కర్త చతుర్థీ విభక్తియందు (ద్వితీయావిభక్తి రూపముతో) ఉండును. క్రియ లింగవచనములయందు కర్మ ననుసరించు చుండును.

ఉదా :—**मुझे कलकत्ते जाना पड़ा** నేను కలకత్తాకు వెళ్లవలసివచ్చెను.

**उसे रोटियाँ खानी पड़ीं** వాడు రొట్టెలు తినవలసివచ్చినది. (బలవంతముచే).

**मुझे दस रुपये दंड देने पड़े** నేను 10 రూపాయలు జుర్మానా యివ్వవలసివచ్చెను.

64. ఒక పని చేయువలసిన యావశ్యకతను తెలుపుటకై క్రియార్థక సంజ్ఞకు **था, होगा, है** వీనిని క్రమముగ భూతభవిష్యద్వర్తమానకాలములందు కర్మయొక్క లింగవచనముల ననుసరించి చేర్పవలెను.

ఉదా :—**मुझे जाना था** నేను పోవలసియుండెను.

**मुझे एक चिट्ठी लिखनी थी** నేను ఒక జాబు వ్రాయవలసి యుండెను.

**मुझे जाना होगा** నేను పోవలసియుండును.

**मुझे जाना है** నేను (తప్పక) పోవలసియున్నది.

**मुझे पाँच रुपये देने हैं** నేను 5 రూపాయలు ఇవ్వవలసియున్నది.

సూచన :—'**होगा**', '**था**', '**है**', వీనికంటె '**पड़ना**' అవసరము యొక్క అధికతను దెల్పును.

65. క్రియార్థకసంజ్ఞకు "**चाहिए**" చేర్చిన తప్పని సరిని తెల్పును '**चाहिये था**' 'యుండవలసినది,' ఇది భూతకాలములో కార్యముయొక్క ఆవశ్యకతను తెల్పును. దీని కర్త చతుర్థీవిభక్తియగు '**को**' ను కలిగియుండును. ఈ క్రియ లింగవచనములలో కర్మ ననుసరించును.

ఉదా :—**तुम को यह काम करना चाहिये** మీరీపని చేయవలయును.
**उसे दवा खानी चाहिये** వాడు మందు తినవలెను.
**तुमको वहाँ जाना चाहिये था** నీవక్కడికి వెళ్లియుండవలసినది.
**उसको वह पुस्तक ज़रूर पढ़नी चाहिये थी** వాడు ఆ పుస్తకమును తప్పక చదివియుండవలసినది.

**हवा** (స్త్రీ.) గాలి
**ज़बान** (స్త్రీ.) నాలుక, భాష
**तकलीफ़** (స్త్రీ.) కష్టము
**मेहमान** అతిథి
**देश** దేశము
**मौत** (స్త్రీ.) మృత్యువు
**सभा** (స్త్రీ.) సమావేశము
**भूल, गलती** (స్త్రీ.) తప్పిదము, పొరపాటు
**सहना** ఓర్చుకొనుట
**परवाह करना** లక్ష్యము చేయుట
**शामिल होना** చేరుట

**बादल** మేఘము
**कारण** కారణము
**मैदान** మైదానము
**दावत** (స్త్రీ.) విందు
**धर्म** మతము, ధర్మము
**जीवन** జీవితము
**विषय** విషయము, అంశము
**के विषय में** విషయము, అంశమును గురించి
**बनना** చేయబడుట, తయారగుట
**इस्तेमाल करना** వాడుట, ఉపయోగించుట

**मर मिटना** నశించిపోవుట

| | |
|---|---|
| **जिधर हवा चलती है उधर ही बादलों को भी चलना पड़ता है।** | గాలి ఎటువచ్చిన మేఘములుగూడ అటే పోవలసి వచ్చుచున్నది. |

| | |
|---|---|
| मुझे उसके साथ तेलुगु में बोलना पड़ा क्योंकि वह दूसरी कोई ज़बान नहीं जानता था। | నేను వానితో తెలుగులో మాట్లాడవలసి వచ్చెను ఎందుకనగా వాడు ఇతర భాష ఏదియు నెరుగడు. |
| उसको मेरे कारण बहुत तकलीफ़ें सहनी पड़ीं। | వాడు నావలన చాల కష్టము లనుభవింప వలసివచ్చెను. |
| तुम्हें किसी बात की परवाह न करके लड़ाई के मैदान में शामिल होना पड़ेगा। | మీరు దేనిని లక్ష్యముచేయక యుద్ధరంగ మునకు దిగవలసియుండును. |
| आज मुझे अपने एक मेहमान को दावत देनी है। | నేడు నా అతిథికొకనికి విందు చేయ వలసియున్నది. |
| हमें अपने देश और धर्म के लिये मर मिटना होगा। | మనము మన దేశమతములకొఱకు నశించి పోవలసియుండును. |
| उन्हें अपने जीवन में बड़े बड़े काम करने थे लेकिन मौत ने ऐसा होने न दिया। | వారు తమ జీవితములో గొప్ప గొప్ప కార్యములు చేయవలసి యుండెను కాని మృత్యువు అలాగున కానియ్య లేదు. |
| हमें अपने देश में बनी हुई चीज़ों का इस्तेमाल करना चाहिये। | మనము మన దేశములో తయారయిన వస్తువుల నుపయోగింపవలెను. |
| हर एक हिन्दुस्तानी को हिन्दी जाननी चाहिये। | ప్రతి హిందూ దేశీయుడును హిందీ తెలిసికొనవలెను. |
| तुम्हें भी उस सभा में इस विषय पर कुछ ज़रूर बोलना चाहिये था। | మీరుకూడ ఆ సభలో యీ విషయము మీద తప్పక కొంచెము మాట్లాడి యుండవలసినది. |

| | |
|---|---|
| मैं ने ग़लती की, मुझे पहिले से ही उनके विषय में सब बातें समझ लेनी चाहिये थीं। | నేను పొరపాటు చేసితిని. నేను మొదటనే వారినిగూర్చిన విషయములన్నియు తెలిసికొని యుండవలసినది. |
| क्या करूँ? अपनी इच्छा के विरुद्ध ही यह काम करना पड़ता है। | ఏమి చేతును ? నా యిష్టమునకు వ్యతిరేకముగానే యీ పనిని చేయవలసి వచ్చుచున్నది. |
| मैं ने बिलकुल नहीं सोचा कि ये सभी फल मुझ ही को खाने पड़ेंगे। | ఈ పండ్లనన్నియు నేనే తినవలసి యుండునని నేను (బొత్తుగా) తలచలేదు. |

---

## పాఠము 25.

## కర్తృవాచక సంజ్ఞ, విశేషణముల తారతమ్య ప్రయోగములు

66. "**वाला**" ప్రత్యయము హిందీలో పలువిధములుగా నుపయోగింపబడును.

1. ఇది వికారమునుచెందిన క్రియార్థక సంజ్ఞకు (**करने** వెం.) చేర్చిన కర్తృవాచక సంజ్ఞయగును.

ఇది తెలుగులోని 'పోవువాడు' 'వచ్చువాడు' వందలి 'వాడు' ను బోలియుండును.

ఉదా :—**बोलनेवाला** మాట్లాడువాడు. **लिखनेवाला** వ్రాయువాడు.

(అ) ఆసన్న భవిష్యదర్థము నిచ్చును.

ఉదా :—**वह आज आनेवाला है** వాడు నేడు రాబోవుచున్నాడు.

**वह लड़का गिरनेवाला था इतने में मैंने उसे पकड़ लिया**

ఆ పిల్లవాడు పడబోవుచుండెను ఇంతలో నేను పట్టుకొంటిని.

2. ఒక నామవాచకమున చేర్చిన 'యజమాని' అను నర్థము నిచ్చును.

ఉదా :—**मकानवाला** ఇంటి యజమాని (ఇల్లుగలవాడు).
**गाड़ीवाला** బండివాడు.

3. "వెలగల" అనునర్థము నిచ్చును.

ఉదా :—**पांच रुपयेवाली किताब** ఐదు రూపాయల (వెలగల) పుస్తకము.

4. "తో చేయబడిన" అనునర్థమున.

ఉదా :—**पत्थरवाला मकान** రాతి (తో కట్టబడిన) యిల్లు.

5. క్రియావిశేషణమునకుగాని, ఊరు మొదలగువాని పేర్లకుగాని చేర్చినపుడు "నివసించు," "ఉండు" అనునర్థము నిచ్చును.

ఉదా :—**ऊपरवाला कमरा** పైనుండు గది.
**मद्रासवाला आदमी** మద్రాసు (లో నివసించు) వాడు.

67. విశేషణ ప్రత్యయము కావున నిది **आ, ए, ई** నియమము (పాఠ. 3, ని. 4) ననుసరించి మారును.

ఉదా :—**बोलनेवाला आदमी** మాట్లాడువాడు (పుంలింగము).
**बोलनेवाली औरत** మాట్లాడు ఆడుది (స్త్రీలింగము).

## విశేషణముల తారతమ్యము (తులన)

68. రెండు వస్తువుల న్యూనాధికతలను తెలుపునపుడు '**से**' (కంటె) ఉపయోగింపబడును. 'తమత్వము'ను తెల్పుటకు '**सब से**' యుపయోగింపబడును.

ఉదా :—यह घर उस घर से बड़ा है (తరము) ఈ యిల్లు ఆ యింటి కంటె పెద్దది.

यह घर सब से बड़ा है (తమము) ఈ యిల్లు అన్నిటికంటె పెద్దది.

69. ఉపమాన వాచకశబ్దము లోపించినపుడు విశేషణమునకు "మధ్య" 'से' ఉపయోగించు విశేషణమును రెట్టించిన 'తమ' మును తెలుపును.

ఉదా :—अच्छे से अच्छा आदमी సర్వోత్తముడయిన మనుష్యుడు.

कठिन से कठिन काम మిక్కిలి కఠినమైన కార్యము.

बड़े से बड़ा అన్నిటికంటె పెద్ద.

సూచన :—పై వాక్యములందు ఉపమాన వాచకములేదు. ఒక విశేషణమే రెండుసార్లు వాడబడియున్నది. మధ్యలో 'से' యున్నది.

'से' యర్థములో से बढ़कर (మించి), की अपेक्षा (కంటె) కూడ వాడబడును.

ఉదా :—सूरदास से बढ़कर हिन्दी में कोई कवि नहीं है సూరదాసుని మించిన కవి హిందీలో ఎవరును లేరు.

उससे बढ़कर बुरा काम कोई नहीं है దీనికి మించిన చెడ్డ పని వేరు లేదు.

'कम తక్కువ' 'ज़्यादा అధికము' వీనినికూడ తారతమ్యమందు వాడుదురు.

ఉదా :—कम सुन्दर తక్కువ అందమైన.

ज़्यादा मज़बूत అధిక బలిష్ఠమైన.

यह उससे ज़्यादा अच्छा है వీడు వానికంటె యెక్కువ మంచి వాడు.

विकना అమ్మబడుట

विश्वास करना } విశ్వసించుట
यक़ीन करना }

तारीफ़ करना ప్రశంసించుట

प्रान्त, सूबा ప్రాంతము

संख्या సంఖ్య

मौक़ा తరుణము

सौ నూరు

पुस्तकालय గ్రంథాలయము

मालिक యజమాని

अंगूठी ఉంగరము

विश्वास, यक़ीन నమ్మకము

रेल गाड़ी రైలుబండి

हवाई जहाज़ గాలి ఓడ, విమానము

इमारत (స్త్రీ.) కట్టడము

नाव (స్త్రీ.) పడవ

सच्चा నిజమైన

बेहतर మంచి

बेचना అమ్ముట

शिकायत करना సాదీ చెప్పుట, మొర పెట్టుకొనుట

होशियार रहना జాగ్రత్తగనుండుట

व्याख्यान ఉపన్యాసము

पार ఒడ్డు, దరి

पचास ఏబది

पत्थर రాయి

पड़ोसी పొరుగువాడు

सोना బంగారము

तारीफ़ (స్త్రీ.) ప్రశంస, పొగడ్త

मुसाफ़िर ప్రయాణికుడు

हवा गाड़ी మోటరు

पैर गाड़ी సైకులు

जहाज़ ఓడ

झूठा అసత్యమైన

खट्टा పుల్లని

होशियार తెలివిగల

बग़ल ప్రక్క, వైపు, పొరుగు

| | |
|---|---|
| इस प्रान्त में अंग्रेज़ी जाननेवालों की संख्या बहुत ज़्यादा है। | ఈ ప్రాంతములో ఇంగ్లీషు తెలిసినవారి సంఖ్య అధికమునున్నది. |
| मैं ख़ूब जानता हूँ कि वह बड़ा खानेवाला है। | వాడు చాలా తిండిపోతని నాకు బాగుగా తెలియును. |
| आज उनके यहाँ दो गानेवाले आये हैं। | నేడు వారి యింటికి యిద్దరు పాటకులు వచ్చియున్నారు. |

कलवाली सभा में मैं भी व्याख्यान देनेवाला था, लेकिन मुझे मौका नहीं मिला।

నిన్నటి సభలో నేనుగూడ నుపన్యసించ నుంటిని కాని నాకవకాశము చిక్క లేదు.

पांच रुपयेवाली घड़ी उतना ही काम देती है जितना सौ रुपयेवाली।

ఐదు రూపాయల గడియారముకూడ నూరు రూపాయల గడియారమంత పనినే జేయును.

नदी के उस पारवाला मकान अडयार का पुस्तकालय है।

నది యావలియొడ్డుననుండు భవనము అడయారు గ్రంథాలయము.

उस पत्थरवाले मकान का मालिक मेरा पड़ोसी है।

ఆ రాతియింటి యజమాని మా పొరుగు వాడు.

हम बग़लवाली गली में रहते हैं।

మేము ప్రక్క (నుండు) వీధిలో నివసించుచున్నాము.

वह टोपीवाला मुसाफ़िर दिल्ली का रहनेवाला है।

ఆ టోపీ (గల) ప్రయాణికుడు ఢిల్లీ నివాసి.

लखनऊवाले बिना टोपी के कभी बाहर नहीं जाते।

లక్నోవాసులు ఎప్పుడును టోపీ లేకుండ బయటికి పోరు.

उस सोनेवाली अंगूठी की क्या कीमत है?

ఆ బంగారపుటుంగరపు వెల ఏమి?

हमें झूठी तारीफ़ करनेवालों की बात का कभी यक़ीन नहीं करना चाहिये।

అసత్యపు పొగడ్తలు జేయువారి మన మెన్నటికిని నమ్మరాదు.

हमें दूसरों की शिकायत करनेवालों से सदा होशियार रहना चाहिये।

ఇతరులపైకొండెములు జెప్పువారి వల్ల మనమెల్లపుడు జాగ్రతగా నుండవలయును.

लक्ष्मण राम से छोटे थे।

లక్ష్మణుడు రామునికంటె చిన్నవాడు.

महाराजा दशरथ के पुत्रों में राम सब से बड़े थे।

దశరథ మహారాజు పుత్రులలో రాముడు అందరికంటె పెద్దవాడు.

| | |
|---|---|
| शहर में रहने से गाँव में रहना बेहतर है। | పట్టణవాసముకంటె గ్రామవాసము శ్రేష్ఠతరము. |
| हवा-गाड़ियाँ रेल-गाड़ियों से ज़्यादा तेज़ दौड़ सकती हैं। | మోటారు బండ్లు రైలు బండ్లకన్న ఎక్కువ వేగముగ పరుగెత్తగలవు. |
| हवाई जहाज़ घंटे में सौ मील से भी आधिक उड़ते हैं। | గాలియోడలు గంటకు నూరుమైళ్ళకంటెను యెక్కువ పోగలవు. |
| कलकत्ते की इमारतें बंबई की इमारतों से कम ऊँची हैं। | కలకత్తాలోని భవనములు బొంబాయిలోని భవనములకన్న తక్కువ యెత్తైనవి. |
| मेरे अच्छे से अच्छे दिन निकल गये। | నా మంచి రోజులు గడచిపోయినవి. |
| मीठे से मीठे फल इस शहर में बिकते हैं। | ఈ పట్టణములో మిక్కిలి తియ్యని పండ్లు అమ్మబడును. |
| मेरी समझ में ये फल सब से बढ़कर खट्टे हैं। | ఈ పండ్లు అన్నిటికంటె పుల్లనివని నా యభిప్రాయము. |
| मैं इस बात में उनको सब से बढ़कर समझता हूँ। | ఈ విషయములో నేను వారిని అందరికంటె శ్రేష్ఠులని తలంచుచున్నాను. |

---

## పాఠము 26.

### కర్మణిప్రయోగము (కర్మవాచ్యము) ప్రేరణార్థకము

70. కర్తృవాచ్యమందు కర్మగానున్న శబ్దము కర్మవాచ్యమందు కర్తయగును. అపుడు క్రియారూపములు కర్మయొక్క లింగవచనముల ననుసరించియుండును. తెలుగులోవలెనే హిందీయందుగూడ కర్మణిప్రయోగము అధికముగా నుపయోగింపబడును.

కర్తృవాచ్య క్రియయొక్క సామాన్యభూతకాల రూపమునకు **जाना** ' చేర్చుటచేత కర్మవాచ్యమగును.

ఉదా :—**खाया जाना** తినబడుట. **दिया जाना** ఇవ్వబడుట.

71. భూత, భవిష్యద్వర్తమానాది కాలములయందు '**जा**' ధాతువు మారుచుండును. ముఖ్య క్రియగూడ కర్తయొక్క లింగవచనముల ననుసరించి మారుచుండును. కర్తృవాచ్యమందు కర్తగానున్న శబ్దమునకు కర్మవాచ్యమందు '**से**' వచ్చును.

ఉదా :—**मुझसे फल खाये जाते हैं** పండ్లు నాచే తినబడుచున్నవి.

**कृष्ण से रोटी खायी जाती है** రొట్టె కృష్ణునిచే తినబడుచున్నది.

72. భావవాచకము : దీనిని అశక్తతను, విధిలేక పోవుట తెలియ పరచుట కుపయోగింతురు. దీని ప్రయోగము కర్మణిప్రయోగమువలెనే యుండును. అకర్మక క్రియకుగూడ ఇది యనువర్తించును. ఇది హిందీ భాషలోని విశేషము గనుక జాగ్రత్తగ గమనింపవలయును. ఇది ఎల్లప్పుడును పుంలింగమందే యుండును.

ఉదా :—**उससे इतना भात खाया नहीं गया** వాడు ఇంత అన్నము తినజాలకపోయెను.

**मुझसे इतनी दूर जाया नहीं जायगा** ఇంత దూరము నాచేత నడువబడజాలదు (నేను ఇంత దూరము నడువజాలను).

సూచన :—**जा** ధాతువు. భావవాచ్యమందు '**जाया जाना**' గా మారును. **गया जाना** అని కాదు. కాలము ననుసరించి రెండవ **जा** మారుచుండును.

73. ఈ క్రింది క్రియలు సహజముగనే కర్మవాచకములు. ఇవి అకర్మకములైనను వీని యర్థమునుబట్టి యివి కర్మవాచకములుగ ప్రయోగింపబడును. వీరైనంతవరకు తెనుగున వీని సమానవాచకము లియ్యబడుచున్నవి.

धुलना=धोया जाना కడగబడుట. ఉతకబడుట. శుభ్రమగుట.

छूटना=छोड़ा जाना వదలబడుట, విడుట, వదలుట (అకర్మకము)

खुलना=खोला जाना తెఱువబడుట తెరచుకొనుట

फूटना=फोड़ा जाना పగులుట

बजना=बजाया जाना మ్రోగుట

टूटना=तोड़ा जाना విరుగుట

खपना=అమ్మబడుట, అమ్ముడుపోవుట (అకర్మకము)

## ప్రేరణార్థకము

74. ఇచ్చట కొన్ని అకర్మక క్రియలయొక్క సకర్మక ప్రేరణార్థక రూపము లియ్యబడుచున్నవి. పాఠకులు వాని నిర్మాణమును గ్రహించుకొనవలెను.

| అకర్మకము | సకర్మకము | ప్రేరణార్థకము |
|---|---|---|
| उठ లేచు | उठा ఎత్తు | उठवा ఎత్తించు |
| गिर పడు | गिरा పడగొట్టు | गिरवा పడగొట్టించు |
| डर భయపడు | डरा భయపెట్టు | डरवा భయపెట్టించు |
| दौड़ పరుగెత్తు | दौड़ा పరుగెత్తించు | दौड़वा పరుగెత్తజేయు |
| जल మండు | जला కాల్చు | जलवा కాల్పించు |
| उड़ ఎగురు | उड़ा ఎగురవేయు | उड़वा ఎగురవేయించు |
| लग తగుల్కొను | लगा తగుల్చు | लगवा తగుల్పజేయు |
| लेट పరుండు | लिटा పరుండబెట్టు | लिटवा పరుండబెట్టించు |
| खेल ఆడు | खिला ఆడించు | खिलवा ఆడింపజేయు |
| डूब మునుగు | डुबा ముంచు | डुबवा ముంపజేయు |
| जाग మేల్కొను | जगा మేల్కొల్పు | जगवा మేల్కొల్పించు |
| जी బ్రతుకు | जिला బ్రతికించు | जिलवा బ్రతికింపజేయు |
| सो నిద్రించు | सुला నిద్రపుచ్చు | सुलवा నిద్రింపజేయు |
| रो ఏడ్చు | रुला ఏడ్పించు | रुलवा ఏడ్పింపజేయు |

| | | |
|---|---|---|
| कट తెగిపోవు | काट కోయు | कटवा కోయించు |
| मर చచ్చు | मार చంపు | मरवा చంపించు |
| लद బరువువేయబడు | लाद బరువువేయు | लदवा బరువువేయించు |
| खुल తెరచుకొను | खोल తెరచు | खुलवा తెరపించు |
| रुक ఆగు | रोक ఆపు | रुकवा ఆపించు |
| लुट దోపిడిపోవు | लूट దోచు | लुटवा దోపించు |
| निकल బయలు వెడలు | निकाल వెడలగొట్టు | निकलवा వెడలగొట్టించు |
| बिगड़ చెడిపోవు | बिगाड़ చెడుపుచేయు | बिगड़वा చెడగొట్టించు |
| पहुँच చేరు | पहूँचा చేర్చు | पहुँचवा చేర్పించు |
| लटक వ్రేలాడు | लटका వ్రేలాడగట్టు | लटकवा వ్రేలాడగట్టించు |
| छूट వదలబడు | छोड़ వదలు | छुड़वा వదిలించు |
| टूट విరుగు | तोड़ విరుగగొట్టు | तुड़वा విరుగగొట్టించు |
| फूट చిను గు | फोड़ వగులగొట్టు | फुड़वा వగులగొట్టించు |
| फट చినుగు | फाड़ చింపు | फड़वा చింపించు |
| बिक అమ్ముడుపోవు | बेच అమ్ము | बिकवा అమ్మించు |

సూచన :—जा, आ, पा, हो వీనికి పైరూపములు లేవు.

75. కొన్ని సకర్మక క్రియలు ప్రేరణ, ద్విప్రేరణార్థకములుగ మారును.

| సకర్మక | ప్రేరణ | ద్విప్రేరణ |
|---|---|---|
| बोल మాటాడు | बुला పిలిపించు | बुलवा పిలిపింపజేయు |
| खा తిను | खिला తినిపించు | खिलवा తినిపింపజేయు |
| पी త్రాగు | पिला త్రాగించు | पिलवा త్రాగింపజేయు |
| दे ఇచ్చు | दिला ఇప్పించు | दिलवा ఇప్పింపజేయు |
| धो కడుగు | धुला కడిగించు | धुलवा కడిగింపజేయు |
| कर చేయు | करा చేయించు | करवा చేయింపజేయు |
| पढ़ చదువు | पढ़ा చదివించు | पढ़वा చదివింపజేయు |

| | | |
|---|---|---|
| **सुन** విను | **सुना** వినిపించు | **सुनवा** వినిపింపజేయు |
| **लिख** వ్రాయు | **लिखा** వ్రాయించు | **लिखवा** వ్రాయింపజేయు |
| **समझ** తెలిసికొను | **समझा** తెలుపు | **समझवा** తెలిపింపజేయు |
| **देख** చూడు | **दिखा** చూపు | **दिखवा** చూపింపజేయు |
| **सीख** నేర్చుకొను | **सिखा** నేర్పు | **सिखवा** నేర్పింపజేయు |

---

## పాఠము 27.

### అభ్యాసవాక్యములు

**चन्द्रमा** చంద్రుడు
**पूँछ** (స్త్రీ.) తోక
**किस्मत** (స్త్రీ.) అదృష్టము
**दूर** (స్త్రీ.) దూరము
**नाई, हजाम** మంగలి
**सेना** (స్త్రీ.) సేన
**कुर्ता** చొక్కాయి
**माल** సామగ్రి
**बीमार** రోగి
**जवाब** జవాబు
**ज़बरदस्त** బలవంతుడు

**पौधा** మొక్క
**राय** (స్త్రీ.) అభిప్రాయము
**कष्ट** కష్టము
**संस्करण** ముద్రణము
**उस्तुरा** మంగలికత్తి
**फ़कीर** ఫకీరు
**कमीज़** షర్టు
**सामान** సామానులు
**अमीर** ధనికుడు
**मुफ़्त** ఉచితముగ
**सहना** ఓర్చుకొనుట

**कि** ఏమనగా, అని

| | |
|---|---|
| कहा जाता है कि चन्द्रमा पर पेड़-पौधे नहीं हैं। | చంద్రునిలో చెట్లు చేమలు లేవని (చెప్ప బడుచున్నది) చెప్పుదురు. |
| कई बार आसमान पर पूँछवाले तारे देखे गये हैं। | అనేక పర్యాయములు ఆకాశమునందు తోక చుక్కలు కనబడినవి (చూడ బడినవి). |

उनको सब बातें लिखी गयी हैं, पर उनसे अभी तक कोई जवाब नहीं आया है।

వారికిఅన్ని విషయములు వ్రాయబడినవి. కాని ఆయనవద్దనుండి యింతవరకు ఏ ప్రత్యుత్తరము రాలేదు.

मेरी राय है कि उनको ये बातें इतनी जल्दी न बतायी जायँ।

వారికి యీ సంగతులు యింత త్వరగా తెలుపగూడదని నా యభిప్రాయము.

क्या किया जाय मेरी किस्मत ही बुरी है।

ఏమి చేతును. నా అదృష్టమే చెడ్డది.

यह आदमी बड़ा कमज़ोर है, इससे चला नहीं जाता।

ఇతడు చాల బలహీనుడు. ఈతడు నడువలేకున్నాడు.

मुझसे तुम्हारे कष्ट सहे नहीं जाते।

నావలన నీకష్టములు సహింపబడజాలవు (నేను నీ కష్టములను చూడలేను).

इस बीमार आदमी से इतनी दूर न जाया जायगा।

ఈ రోగి యింతదూరము పోజాలడు.

इस संस्करण की तमाम पुस्तकें बहुत जल्दी खप जायँगी।

ఈ ముద్రణముయొక్క పుస్తకములన్నియు చాలత్వరగ అమ్ముడుబోవును.

रास्ते में मेरी छड़ी टूट गयी।

త్రోవలో నా చేతికఱ్ఱ విరిగిపోయినది.

मेरे पास उस्तुरा नहीं है, इसलिये मैं नाई से बाल बनवाता हूँ।

నావద్ద మంగలి కత్తిలేదు. కావున మంగలిచేత క్షౌరము చేయించుకొను చున్నాను.

अमीर लोग अपने हाथ से कुछ नहीं करते, सब काम नौकरों से करवाते हैं।

ధనికులు తమ చేతితో ఏమియు చేయరు. అన్ని పనులు నౌకరుల ద్వారా చేయించెదరు.

ज़बरदस्त दुश्मन को देख, राजा ने अपनी सेना हटा ली।

బలవంతుడగు శత్రువును జూచి రాజు తన సైన్యమును మరలించుకొనెను.

जो बातें तुम ख़ुद नहीं समझते उन्हें दूसरों को कैसे समझा सकते हो?

నీ వెరుగని విషయములను యితరుల కెట్లు తెలుపగలవు?

| | |
|---|---|
| रोम के बादशाह नीरो ने बहुत लोगों के घर जलवा दिये थे। | రోము చక్రవర్తి నీరో అనునతడు అనేకుల యిండ్లు తగుల బెట్టించెను. |
| बहुत लोगों को मोटर चलाना नहीं आता। | చాలమందికి మోటారు నడుపుటరాదు. |
| मैंने उस दर्ज़ी से चार कुर्ते और दो कमीज़ सिलवाये। | నేను ఆదర్జీవానిచేత నాల్గు చొక్కాలను, రెండు షర్టులు కుట్టించితిని. |
| उन्होंने मेरे सारे माल जहाज़ में मुफ़्त लदवा दिये। | ఆయన నా సామానులనన్నింటిని ఉచితముగ ఓడలో వేయించెను. |
| कहा जाता है कि औरंगज़ेब ने जसवन्तसिंह को मरवा डाला था। | ఔరంగజేబు యశవంత సింహుని చంపించినాడని చెప్పబడుచున్నది. |
| उन्होंने उस फकीर को घर से बाहर निकलवा दिया। | ఆయన ఆ ఫకీరును యింటి (లోనుండి) బయటికి తఱిమి వేయించినారు. |
| मैं ख़ुद नहीं लिख सकता था, इसलिये यह चिट्ठी उनसे लिखवा ली थी। | నేను స్వయముగ వ్రాయజాలకుంటిని కావున యీ జాబు నతనిచేత వ్రాయించుకొంటిని. |
| आजकल मुझे कोई हिन्दी नहीं सिखाता: मैं ख़ुद सीखता हूँ। | ప్రస్తుతము నా కెవ్వరును హిందీనేర్పుట లేదు. నేను స్వయముగ నేర్చుకొను చున్నాను. |
| जो काम करो सो ठीक ठीक करो। | చేయు పని తిన్నగా చేయుము. |
| तुम जो कहो सो करूँगा। | నీవు చెప్పునది చేయుదును. |

## పాఠము 28.

### ఇతర భాషా భాగముల (శబ్దముల) నుండి యేర్పడు క్రియలు

76. చాల క్రియలు నామవాచకములకు, విశేషణములకు, అవ్యయములకును **होना** గాని **करना** గాని చేర్చుటచే నేర్పడును. '**होना**' చేర్చుటచే అకర్మకములు, '**करना**' చేర్చుటచే సకర్మకములును అగును. ఇట్టి క్రియలు వెనుకటి పాఠములలో కొన్ని యివ్వబడినవి యిచ్చట మరికొన్ని యివ్వబడుచున్నవి.

(అ) నామవాచకములకు **होना, करना** చేర్చుటచే నేర్పడు క్రియలు.

**शुरू** ప్రారంభము, **शुरू होना** ప్రారంభమగుట (అకర్మకము), **शुरू करना** ప్రారంభించుట (సకర్మకము; **याद** స్మరణ, **याद होना** స్మరణకు వచ్చుట, **याद करना** స్మరించుట, **तयार** సిద్ధము, **तयार होना** సంసిద్ధమగుట, **तैयार करना** సంసిద్ధము చేయుట.

(ఆ) విశేషణములనుండి—

**मीठा** తియ్యని, **मीठा होना** తియ్యనగుట, **मीठा करना** తీపు చేయుట **छोटा** చిన్న, పొట్టి **छोटा होना** చిన్నది యగుట, **छोटा करना** చిన్నది చేయుట, **चिकना** నున్ని, **चिकना होना** నునుపగుట, **चिकना करना** నునుపు జేయుట, **चकित** చకితుడు; **चकित होना** చకితుడగుట, **चकित करना** చకితుని జేయుట, **खराब** చెడ్డ, **खराब होना** చెడుట, **खराब करना** చెడగొట్టుట, **अच्छा** మంచి, **अच्छा होना** బాగుపడుట, **अच्छा करना** బాగుపరచుట, **खड़ा** నిల్చిన, **खड़ा होना** నిల్చుండుట, **खड़ा करना** నిలుపబెట్టుట, **नीचा** క్రింద, **नीचा होना** తగ్గుట, **नीचा**

**करना** క్రిందుచేయుట, **ऊँचा** ఎత్తైన, **ऊचा होना** పెరుగుట, **ऊँचा करना** ఎత్తుచేయుట, పైకెత్తుట.

(ఇ) క్రియా విశేషణములనుండి—

**ऊपर** పైన, మీద, **ऊपर होना** మీద అగుట, **ऊपर करना** మీదచేయుట, **आगे** ముందు, **आगे होना** ముందుండుట, **आगे करना** ముందుంచుట, **पीछा करना** వెన్నంటుట.

2. కొన్ని నామవాచకములకు కడపట **देना, खाना, उड़ना, लड़ाना, मचाना, उठाना** మొదలగునవి చేర్చుటచే క్రియలేర్పడును.

| | |
|---|---|
| **जवाब** జవాబు | **जवाब देना** జవాబిచ్చుట |
| **धोखा** మోసము | **धोखा देना** మోసపుచ్చుట |
| **सज़ा** (స్త్రీ) దండన | **सज़ा देना** దండించుట |
| **क़सम** (స్త్రీ.) ఒట్టు | **क़सम खाना** ప్రతిజ్ఞచేయుట |
| **मार** (స్త్రీ.) దెబ్బలు | **मार खाना** దెబ్బలు తినుట |
| **हवा** (స్త్రీ.) గాలి | **हवा खाना** చల్లగాలిలో తిరుగుట (షికారు వెళ్లుట) |
| **ग़म** దుఃఖము | **ग़म खाना** దుఃఖపడుట |
| **मज़ा** ఆనందము | **मज़ा उड़ाना** ఆనందము ననుభవించుట |
| **मौज़** ఆనందము | **मौज़ उड़ाना** ఆనందము ననుభవించుట |
| **रुपये** ధనము | **रुपये उड़ाना** ఆనందముగా ఖర్చుచేయుట |
| **माल** సొత్తు | **माल उड़ाना** కాజేయుట, దప్పళముగొట్టుట |
| **दिमाग़** మెదడు | **दिमाग़ लड़ाना** మెదడు నుపయోగించుట; తల బ్రద్దలు గొట్టుకొనుట |
| **होश** స్పృహ | **होश उड़ना** స్పృహ తప్పుట |
| **अक़्ल** (స్త్రీ.) తెలివి | **अक़्ल लड़ाना** తెలివి నుపయోగించుట |
| దంబము | **गप लड़ाना** వ్యర్థ ప్రసంగముచేయుట |

| | |
|---|---|
| झगड़ा జగడము | झगड़ा मचाना తగవుపెట్టుట |
| शोर అల్లరి | शोर मचाना అల్లరి చేయుట |
| गुस्सा కోపము | गुस्से में आना కోపపడుట |
| अचंभा ఆశ్చర్యము | अचंभे में आना ఆశ్చర్యపడుట |
| ख़बर సమాచారము | ख़बर देना ఎఱుకపరచుట |
| धक्का త్రోపు | धक्का देना త్రోయుట |
| तलाक़ విడాకులు | तलाक़ देना విడాకులిచ్చుట |
| दुख / कष्ट } కష్టము | दुख उठाना / कष्ट उठाना } కష్టపడుట, దుఃఖము ననుభవించుట |
| कष्ट ఇబ్బంది | कष्ट सहना కష్టము ఓర్చుకొనుట |
| मुसीबत ఇక్కట్టు | मुसीबत झेलना ఇక్కట్టు ననుభవించుట |
| जी హృదయము | जान (స్త్రీ) ప్రాణము |
| गाना పాట, సంగీతము | गड़बड़ గడిబిడ |
| ज़िन्दगी జీవితము | बाल వెండ్రుకలు |
| शेर సింహము | डाकू దోపిడిగాడు |
| झंडा పతాకము, జెండా | भोजन, खाना భోజనము |
| जलपान, नाश्ता అల్పాహారము | नाराज़ కోపముగల |
| मौजूद హాజరు | क़बूल करना స్వీకరించుట |
| घबड़ाना భయపడుట ; కలతనొందుట | उड़ना ఎగురుట |
| डाँटना బెదరించుట | कमाना సంపాదించుట |
| बेकार నిరుపయోగమగు | तंग आना విసుగుజెందుట |
| पार पाना గట్టెక్కుట | बेकार అవసరముగ, వృథాగా |

| | |
|---|---|
| वह जी-जान से मुझे प्यार करता है। | వాడు మనస్ఫూర్తిగ నన్ను ప్రేమించుచున్నాడు. |
| उनका गाना शुरू होते समय मैं वहाँ मौजूद नहीं था। | వారి పాట ప్రారంభమయినపుడు నేనక్కడ లేకుంటిని. |

| | |
|---|---|
| तुमने सब गड़बड़ कर दिया। | నీవు అంతయు గడిబిడచేసితివి. |
| उसने मेरा सब काम खराब कर दिया, यह सुनकर मैं घबड़ा गया। | వాడు నా పనినంతయు పాడుచేసెను (అది) విని నేను కంగారుపడితిని. |
| बेकार क्यों इतने नाराज़ होते हो? | అనవసరముగ నెందుకిట్లు కోపపడెదవు? |
| उसने अपनी ज़िन्दगी में कभी किसी की मदद नहीं की। | వాడు తన జీవితములో నెపుడును నెవరికిని సహాయము చేయలేదు |
| शेर को देखते ही मेरे होश उड़ गये। | సింహమును చూడగనే నా స్మృతి తప్పిపోయెను. |
| नाई ने मेरे बाल बहुत छोटे कर दिये। | మంగలి నా వెంట్రుకలు చాలా పొట్టిగా జేసి వేసెను. |
| अध्यापक ने विद्यार्थी को बेंच पर खड़ा कर दिया। | ఉపాధ్యాయుడు విద్యార్థిని బల్లమీద నిలువబెట్టెను. |
| झंडे को और थोड़ा ऊंचा कर दो। | జండాను యింకా కొంచెముపైకెత్తుము. |
| मैं कसम खाकर कहता हूँ कि मुझे इस बात का बिलकुल पता नहीं था। | నేను ఒట్టుపెట్టుకొని చెప్పుచున్నాను నాకీ సంగతి ఏమియు తెలియదు. |
| मार खाने पर भी उसने अपना क़सूर कबूल नहीं किया। | దెబ్బలు తిన్నను వాడు తన తప్పిదము నొప్పుకొనలేదు. |
| बहुत देर तक दिमाग लड़ाने पर भी यह बात उसकी समझ में नहीं आयी। | తల ఎంతసేపు బ్రద్దలు కొట్టుకొనినను యీ విషయము వాడు తెలిసికొనలేక పోయెను. |
| तुमने व्यर्थ का झगड़ा खड़ा कर दिया। | నీవు వ్యర్థముగా జగడము పెట్టితివి. |
| जज ने डाकुओं को कड़ी सज़ा दी। | జడ్జి దొంగలకు కఠినశిక్ష విధించెను. |

| | |
|---|---|
| इस क्लास के लड़के बहुत शोर मचाते हैं। | ఈ తరగతి బాలురు చాల అల్లరి చేయుచున్నారు. |
| तुम तो इतने खराब निकले कि तुम से पार पाना मुश्किल है। | నీవు చాల చెడ్డవాడవైనావు నీతో వేగుట కష్టము. |
| तुमको क्या है, तुम बैठे बैठे मज़ा उड़ाओ। | నీకేమి. నీవు హాయిగా కూర్చో. |
| मालिक ने नौकर को बहुत डाँटा, लेकिन नौकर गम खा गया। | యజమాని చాల చీవాట్లు పెట్టెనుగాని నౌకరు మిన్నకుండెను. |
| चलो, आज समुद्र पर हवा खाने चलें। | పద, నేడు సముద్రపు ఒడ్డునకు షికారు పోదము. |
| मैं आपका भोजन तैयार कर दूँ? | నేను మీ భోజనమును సంసిద్ధపరుచనా? (వంటజేసి పెట్టనా)? |
| रामचन्द्र, घर जाओ, नाश्ता तैयार है। | రామచంద్రా. యింటికి పో. ఫలహారము సిద్ధముగానున్నది. |
| उन्होंने बहुत कष्ट झेल करके रुपये कमाये हैं। | అతడు అనేక కష్టములు పడి డబ్బు సంపాదించినాడు. |
| वह दो घंटे से यहाँ खड़ा है। | వాడు రెండు గంటల నేపటినుండి యిచ్చట నిల్చియున్నాడు. |
| खड़े रहो, मैं भी तुम्हारे साथ चलता हूँ। | ఆగుము, నేనుగూడ మీవెంట వచ్చెదను. |
| जब वह गाड़ी खड़ा करता है तब उसमें बैठो। | వాడు బండి నిలిపినపుడు దానిలో కూర్చొనుడు. |
| मैं खड़ा होता हूँ, तुम जल्दी आओ। | నేను ఆగెదను, మీరు త్వరగా రండి. |
| तुमसे हम तंग आ गये। | మీవలన మేము విసుగు చెందితిమి. |

## పాఠము 29.

### (విభక్తిప్రత్యయముల విశేష ప్రయోగములు)

విభక్తుల సాధారణ ప్రయోగము వెనుక చెప్పబడినది. ఇచ్చట వాని విశేష ప్రయోగములు కొన్ని యివ్వబడుచున్నవి.

77. ఈ క్రింది క్రియలకు ముందు **से** వచ్చును.

**कहना, पूछना, बोलना, मांगना, डरना, प्रार्थना करना, बात करना** (మాట్లాడుట), **पाला पड़ना** (పాలిట బడుట), **मिलना** లేక **मुलाक़ात करना, वादा करना, इनकार करना, मुहब्बत करना, तंग आना, शादी करना, प्रेम करना।**

ఉదా :—**उससे कहो, राम से पूछो, ईश्वर से प्रार्थना करो, राम से मिलो, देने से इनकार मत करो, रामराव की लड़की से शादी करो** మొ.

గమ :— '**से**' తో '**मिल**' వాడునపుడు కోరికమీద కలిసికొనుటయు '**को**' తో వాడునపుడు అకస్మాత్తుగా కలిసికొనుటయు సూచించును.

ఉదా :—**मैं अध्यापक से मिला** నేను ఉపాధ్యాయుని కలిసికొంటిని.
(నా కోరిక లేక పనిమీద ఉపాధ్యాయుని కలిసికొంటిని.
**मैं अध्यापक को मिला** నేను ఉపాధ్యాయుని కలిసికొంటిని.
(నాకు ఉపాధ్యాయుని కలువవలయునని అగత్యములేదు కాని దారిన పోవుచుండగా దైవికముగ కలిసితిని).

2. ఒక్కొక్కప్పుడు '**से**' లోపించును.

ఉదా :—**आँखों से देखना** కు బదులు **आँखों देखना**
**कानों से सुनना** .. **कानों सुनना**
**भूख से मरना** .. **भूखों मरना** అనియు వాడుదురు.

షష్ఠీవిభక్తి వచ్చునవి.

78. కొన్ని నామవాచక జన్యక్రియలయందు నామవాచకమే ప్రధాన మగుటచే వానియందు లింగభేదము ననుసరించి షష్ఠీవిభక్తి ప్రత్యయము వచ్చును. **याद करना** (స్మరించుట), **भरोसा रखना** (నమ్మకముంచుట), **यक़ीन करना** (విశ్వసించుట), **तारीफ़ करना** (ప్రశంసించుట), **शिकायत करना** (మొఱపెట్టుకొనుట), **इज़्ज़त करना** (గౌరవించుట), **इन्तज़ार करना, प्रतीक्षा करना** (ఎదురు జూచుట), **परवाह करना** (లక్ష్యపెట్టుట), **हँसी उड़ाना** (పరిహాసము చేయుట), **अपराध करना** (తప్పు చేయుట).

ఉదా :—**वह मेरी मदद करता है** వాడు నాకు సాయము చేయుచున్నాడు.
**हम उनकी इज़्ज़त करते हैं** మేము వారిని గౌరవించెదము.
**मैं आपका इन्तज़ार करता था** నేను తమరికొఱకు కాచుకొని యుంటిని.

1. ఒక వస్తువు వెల తెలుపుటకుకూడ షష్ఠీవిభక్తి ప్రత్యయ ముప యోగింపబడును.

ఉదా :—**दो रुपये की पुस्तक** రెండు రూప్యముల పుస్తకము.
**सौ रुपये का घोड़ा** నూరు రూపాయల గుఱ్ఱము.

2. గుణరూపములను తెల్పునది— **पत्थर का मकान** రాతియిల్లు, **सोने का प्याला** బంగారపు గిన్నె, **तुलसीदास की रामायण** తులసీదాసు రచించిన రామాయణము.

3. నివాసమును తెలుపుటకు—**कलकत्ते का व्यपारी** కలకత్తా వర్తకుడు, **गांव का आदमी** పల్లెటూరివాడు.

4. కాలవాచకముగ—**दो बरस का बालक** రెండేండ్ల బాలుడు, **दस बरस की लड़की** పదేండ్ల బాలిక.

— తెలుగులోని 'కు' షష్ఠికి బదులుగాను, అవయవముల సంబంధము, స్థిరాస్తిని, తెలియచేయుటకును **के** వాడవచ్చును.

**राम के एक लड़की है** రామునకు ఒక కూతురు కలదు, **हाथी के चार पैर होते हैं** ఏనుగునకు నాలుగు కాళ్లు గలవు, **मेरे भाई नहीं है** నాకు సహోదరుడు లేడు, **उसके दो घर हैं** వానికి రెండిండ్లున్నవి.

79. ఈ క్రింది క్రియలకు ముందు **पर** వచ్చును :—

**भरोसा करना** ఒకానొక విషయమునకై ఒకరిని నమ్ముకొని యుండుట, **विश्वास, यक़ीन करना** విశ్వసించుట, **रहम, मेहरबानी करना** దయయుంచుట (తెలుగులోవలెనే) **ज़बरदस्ती करना** అధికారమును చూపించుట, బలాత్కారము చేయుట, **हमला करना** ఎదిరించుట (శత్రువును), **शक करना** సందేహించుట, **ज़ुल्म करना** అత్యాచారములు చేయుట, పీడించుట (తెలుగులోగూడనిట్లే), **नाराज़ होना** కోపపడుట.

ఉదా :—**उस पर भरोसा मत करो** వానిని నమ్ముకొని యుండవద్దు.

**वह लोगों पर ज़बरदस्ती करता है** వాడు జనులమీద అధికారము చెలాయించుచున్నాడు.

**यह इलज़ाम मुझपर क्यों लगाते हो ?** ఈ నేరము నాపై నేల నారోపించెదరు ?

**वे मुझपर नाराज़ हैं** వారు నాపై కోపముగనున్నారు.

80. చతుర్థీవిభక్తి—

1. ఇది తెలుగులోని 'కు' షష్ఠీవిభక్తి ప్రత్యయమునకు బదులుగా వాడవచ్చును.

**याद** జ్ఞప్తి, **परवाह** లక్ష్యము, **डर** భయము, **आवश्यकता**, **ज़रूरत** అవసరము, **खेद**, **दुख** దుఃఖము, **ख़ुशी** సంతోషము, **चिन्ता** లేక **रंज** విచారము మొదలగువానియందు చతుర్థీవిభక్తి '**को**' ప్రత్యయము వచ్చును.

ఉదా :—**मुझे याद है** నాకు జ్ఞప్తియున్నది.
**उसको डर है** వానికి భయము కలదు (వాడు భయపడుచున్నాడు).
**मुझे ख़ुशी है** నాకు సంతోషము (నేను సంతసించుచున్నాను).

2. **पसन्द** ఇష్టము, **मज़ूर** సమ్మతము, **मालूम** తెలిసినది మొద లగువానియందు చతుర్థీ '**को**' ప్రత్యయము వచ్చును.

ఉదా :—**मुझे आम पसंद है** నాకు మామిడిపండు యిష్టము.
**यह उनको मंजूर है** ఇది ఆతనికి సమ్మతముగనున్నది.
**मुझे मालूम है** నాకు తెలియును.

3. **मिलना** (దొరకుట) **चाहिये** (కావలయును) ఈ క్రియలకు ముందు చతుర్థీ '**को**' వచ్చును.

ఉదా :—**मुझे एक पुस्तक मिली** నాకు ఒక పుస్తకము దొరికెను.
**मुझे थोड़ा पानी चाहिये** నాకు కొంచెము నీళ్లు కావలెను.
**राम को एक पुस्तक चाहिये** రామునకు ఒక పుస్తకము కావలెను

81. తెలుగులో నుపయోగించు 'లోనుండి' 'మీదినుండి' వానికి సరిగ హిందీలో '**में से**', '**पर से**' యుపయోగింపవచ్చును.

ఉదా :—**दोनों में से** ఇరువురిలోనుండి **समुद्र में से** సముద్రములోనుండి
**जेब में से** జేబులోనుండి **पेड़ में से** చెట్టుమీదనుండి
**आसमान पर से** ఆకాశముమీదనుండి

**पर** (మీద) వేర్వేరు అర్థములలోగూడ నుపయోగింపబడును.

ఉదా :—**घर पर** ఇంటివద్ద   **आसमान पर** ఆకాశమందు
**देखने पर** చూచినమీదట, తర్వాత.

**प्रार्थना** (స్త్రీ.) ప్రార్థన
**कुशल** (స్త్రీ.) క్షేమము
**मुलाक़ात** (స్త్రీ.) కలయిక
**इलज़ाम** నేరము
**घी** నెయ్యి
**सलाम** వందనము
**वादा** ప్రతిజ్ఞ
**इनकार** తిరస్కారము
**अजनबी** క్రొత్తవాడు
**संभालना** నిర్వహించుట

| | |
|---|---|
| मैं ईश्वर से प्रार्थना करता हूँ कि वह तुम्हें कुशल से रखे। | మీకు సుఖము నిచ్చుటకు నేను ఈశ్వరుని ప్రార్థించుచున్నాను. |
| तू उससे क्या बातें करता है? | నీవు వానితో నేమి మాట్లాడుచున్నావు? |
| घी-वाले को देने के लिये मेरे भाई से दस रुपये माँग लाओ। | నేతివానికిచ్చుటకు మా తమ్ముని నడిగి పది రూపాయిలు తెమ్ము. |
| कल जब मैं बाज़ार जा रहा था तब एक अजनबी आदमी ने सलाम कर मुझसे पूछा—"तुम्हारे बाप का क्या नाम है?" | నిన్న నేను బజారులో వెళ్లునపుడొక క్రొత్త మనుష్యుడు నాకు సలాము చేసి—'మీ తండ్రిగారి పేరేమి' అని నన్నడిగెను. |
| मैं इस दुनिया में किसी से नहीं डरता। | నేను ప్రపంచములో నెవరికిని భయపడను. |
| वे तुमसे तंग आ गये हैं। | వారు నీతో చాల విసుగుజెందిరి. |
| मुझे एक ज़बरदस्त आदमी से पाला पड़ा है। | నాకొక గట్టి మనుష్యునితో పని కల్గినది. |
| मैं कल सवेरे उनसे मुलाक़ात करूँगा। | నేను రేపు ఉదయము వారిని కలిసికొందును. |

| | |
|---|---|
| वह मुझसे वादा कर चुका है, अब रुपये देने से इनकार नहीं कर सकता। | వాడు నాతో వాగ్దానము చేసినాడు (కావున) ఇప్పుడు రూపాయలు యివ్వననలేడు. |
| मेरे दोस्त उस लड़की से बहुत ख़ुश हैं, वे ज़रूर उससे शादी करेंगे। | ఆ పిల్ల మీద నా స్నేహితుడు బాగుగ ఇష్టపడినాడు. అతడు ఆమెను తప్పక పెండ్లాడును. |
| उसपर भरोसा मत रखो, वह बड़ा बेईमान है। | అతనిని నమ్మవద్దు. అతడు చాల నమ్మ దగనివాడు. |
| तुम मुझपर यह झूठा इलज़ाम मत लगाओ। | మీరు నాపై యీ అసత్యమగు నేరము నారోపించవద్దు. |
| आप मुझपर नाराज़ न होइये। | తమరు నాపై కోపపడకండి. |
| आजकल मुझपर आपकी मेहरबानी नहीं है। | ప్రస్తుతము తమరికి నాపై దయలేదు. |
| मुझे कुछ डर नहीं है, मैं अपना काम ख़ुद सँभाल लूँगा। | నాకేమియు భయములేదు. నా పనినేను స్వయముగ నిర్వహించుకొనెదను. |
| तुम ख़ुश रहो या नाख़ुश, उसे क्या परवाह है? | మీరు సంతసించినను లేకపోయినను వాని కేమి లెక్క. |
| मुझे उनका पता याद नहीं। | నాకు వారి చిరునామా జ్ఞప్తి లేదు. |
| तुम्हारी बातें मुझे बिलकुल पसन्द नहीं। | మీ మాటలు నాకు బొత్తిగా నచ్చుట లేదు. |
| आपको इतने रुपये कहाँ से मिले? | తమకిన్ని రూపాయలెక్కడ నుండి దొరికినవి? |
| आजकल मैं बड़ी तकलीफ़ में हूँ, न मालूम ख़ुदा को क्या मंजूर है। | నేనిప్పుడు చాల కష్టముల పాలై యున్నాను. భగవంతునికేమి ఇష్టమో తెలియదు. |
| वह आपकी बड़ी तारीफ़ करता है। | వాడు తమను చాల పొగడుచున్నాడు. |

| | |
|---|---|
| मेरी शिकायत उनसे मत करो। | నామీదవానితో (నేమియు) కొండెములు చెప్పకుడు. |
| उसको मेरा पता मालूम नहीं है। | వానికి నా చిరునామా తెలియదు. |
| मुझे हिन्दी अच्छी तरह मालूम है। | నాకు హిందీ చక్కగా తెలియును. |
| तुमको क्या चाहिये ? | మీకేమి కావలయును ? |
| मुझे आपसे कुछ नहीं चाहिये। | నాకు తమ (వద్ద) నుండి యేమియు (నక్కరలేదు) వద్దు. |
| दोनों में से तुमको जो पसन्द हो, ले लो। | రెంటిలోనుండి మీకు నచ్చినది తీసి కొనుము. |
| कल उसका भाई पेड़ पर से गिर पड़ा। | నిన్న వాని తమ్ముడు చెట్టుపైనుండి క్రిందపడెను. |

---

## పాఠము 30.

### **लगना** యొక్క వేర్వేరు ప్రయోగములు

82. హిందీలో **लगना** విశేషముగ వాడబడును. ఇది సంస్కృతములోని '**लग्न**' "తగులు" అనుదాని యొక్క తత్సమరూపము. ఇది హిందీలో ననేకార్థముల నిచ్చుచుండును, దీని సకర్మకక్రియ **लगाना**।

1. సంపర్కము—**किनारे लगना** దరిచేరుట (ఒడ్డు తగులుట). **गले लगना** కౌగలించుకొనుట, **दिल लगना** హృదయము తగుల్కొనుట (ప్రీతి కల్గుట), **कान लगाना** చెవి యొగ్గుట (ధ్యానముతో వినుట), **दोस्ती लगाना** స్నేహము చేసికొనుట, **दरवाज़ा लगाना** తలుపు వేయుట, **टकटकी लगाना** తదేక దృష్టితో చూచుట.

2. దెబ్బ మొదలగునవి తగులు అర్థమున—**चोट लगना** దెబ్బ తగులుట, **गोली लगना** తుపాకి మొ. గుండు తగులుట, **बात लगना** మాట తగులుట, (చురుకుగ తోచుట), **ठोकर लगना** ఎదురుదెబ్బ తగులుట.

3. "అనుకొనియుండు" అను అర్థమున—**उसका घर पाठशाला से लगा है** వాని యిల్లు పాఠశాలకు అనుకొనియున్నది.

4. విశేషణములో వచ్చిన 'మనోభావము', 'రుచి'ని తెల్పును—**अच्छा लगना** బాగుగ తోచుట (నచ్చుట), **बुरा लगना** చెడ్డగ తోచుట, **मीठा लगना** తియ్యగనుండుట, **ठण्डा लगना** చల్లగనుండుట.

5. "తత్పరతా"ర్థమున—**काम में लगना** కార్య నిమగ్నుడగుట, **पढ़ने में लगना** చదువుటయందు నిమగ్నుడగుట.

6. క్రియార్థక సంజ్ఞ కడపటి **आ** ను **ए** చేసి **लग** చేర్చిన "సాగుట" (ప్రారంభించుట) అను అర్థము నిచ్చును. (20వ పాఠము, నియ. 5 చూడుము)—**खाने लगना** తినసాగుట.

7. "ఆరోపించుట" (లేనిది మైఁబెట్టుట)—**दोष लगाना** దోషము నారోపించుట, **पाप लगाना** పాపము నొడిగట్టుట.

8. ఇతర ప్రయోగములు—**प्यास लगना** దప్పికగానుండుట, **भूख लगना** ఆకలి కలుగుట, **ढेर लगना** పోగుబడుట, **बाज़ार लगना** అంగళ్ళు తెరుచుట, **भीड़ लगना** గుంపుగూడుట, **ढेर लगाना** ప్రోగుపోయుట, **छाता लगाना** గొడుగు పట్టుట, **पेड़ लगाना** చెట్టు నాటుట, **हिसाब लगाना** లెక్క వేయుట, **पता लगाना** జాడతీయుట, **ज़ोर लगाना** బలము నుపయోగించుట, **रंग लगाना** రంగు వేయుట, **ताला लगाना** (తలుపులు) తాళము వేయుట, **आग लगाना** నిప్పంటించుట, **तेल लगाना**

నూనె బూసికొనుట, **कपड़े लगाना** వస్త్రములు ధరించుట, **दाम लगाना** ధరకట్టుట, **काम में लगना** పని ప్రారంభించుట, **मतलब लगाना** అర్థము చెప్పుట, **फल लगना** కాయలు కాయుట, **फूल लगना** (చెట్టు) పూయుట, **अंदाज़ लगाना** ఊహించుట.

9. బంధుత్వము తెలుపుటకు—**चाचा लगना** పెత్తండ్రియగుట.

ఉదా:—**वे मेरे मामा लगते हैं** వారు నాకు మేనమామ యగుదురు.

| | | |
|---|---|---|
| **नाव** పడవ | **दिल** హృదయము | **तीर** బాణము |
| **धनुष** విల్లు | **चोट** (స్త్రీ.) గాయము | **पेट** పొట్ట |
| **भूख** (స్త్రీ.) ఆకలి | **प्यास** (స్త్రీ.) దప్పిక | **धूप** (స్త్రీ.) ఎండ |
| **छाता** గొడుగు | **हिसाब** లెక్క | **बाग** తోట |
| **साला** బావమరది | **उठाना** పైకెత్తుట | **चपत** చెంపదెబ్బ |

| | |
|---|---|
| **मुझे देखते ही उन्होंने गले लगा लिया।** | నన్ను చూచటతోడనే ఆయన కౌగలించుకొనెను. |
| **वह लड़का ख़ूब दिल लगाकर पढ़ता है।** | ఆ బాలుడు ఎక్కువ శ్రద్ధతో చదువుచున్నాడు. |
| **मेरी बातें उनको तीर की तरह लगीं।** | నామాట లాతనికి ములుకులవలె తగిలినవి. |
| **तुम्हें यह चोट कहाँ लगी ?** | మీకిగాయ మెచ్చట తగిలెను ? |
| **मेरा घर उसके घर से लगा है।** | నా యిల్లు ఆయనయింటి నానుకొనియున్నది. |
| **तुमको ये बातें बुरी क्यों लगती हैं ?** | మీకిమాటలేల చెడుగుగ తోచుచున్నవి. |
| **तुम्हें कौन फल सबसे मीठा लगता है ?** | మీకేపండు అన్నిటికన్న తియ్యగ నుండును ? |

| | |
|---|---|
| वह काम में लगा है, उसे तंग मत करो। | ఆతడు పనియందున్నాడు. వానిని విసిగించవద్దు. |
| आप कब से यहाँ आने लगे हैं? | తమరెప్పటినుండి యిచ్చటకు రాసాగితిరి (వచ్చుచున్నారు)? |
| तुम यह दोष मुझ पर क्यों लगाते हो? | మీరీదోషమును నాపై నేల యారోపించెదరు? |
| मुझे बड़ी प्यास लगी है, थोड़ा पानी पिलाओ। | నాకుచాల దాహమగుచున్నది. కొంచెము నీళ్లిండు. |
| मेरा पेट ठीक नहीं, आजकल मुझे भूख नहीं लगती। | నాకు కడుపులో బాగుండుటలేదు, ప్రస్తుతము నాకు ఆకలి వేయుటలేదు. |
| बड़ी धूप है, अपना छाता लगाओ। | చాల ఎండగ నున్నది. మీ గొడుగు తెఱువండి. |
| आप कब तक हिसाब लगाते रहेंगे? | తమరెంతవరకు లెక్క వేయుచుండెదరు? |
| क्या अभी तक उनका पता नहीं लगा? | ఇంతవరకు వారి జాడ తెలియలేదా? |
| बहुत ज़ोर लगाने पर भी रावण धनुष को नहीं उठा सका। | చాల బలము ప్రయోగించినను రావణుడు విల్లు నెత్తజాలక పోయెను. |
| अभी बाज़ार नहीं लगा? | ఇంకను అంగళ్లు తీయలేదా? |
| आपके घर के सामने इतनी भीड़ क्यों लगी है? | మీ యింటి యెదుట నింత గుంపేల చేరినది? |
| कल उस गरीब के घर में आग लग गयी। | నిన్న ఆ బీదవాని యింటికి నిప్పంటుకొనెను. |
| मैंने इस वर्ष अपने बाग में आम के दस पेड़ लगवाये हैं। | నేనీ సంవత్సరము నా తోటలో పది మామిడి చెట్లు నాటించితిని. |
| वे तुम्हारे कौन लगते हैं? | వారు మీకేమి కావలెను? |

| | |
|---|---|
| वे मेरे साले लगते हैं। | వారు నాకు బావమరిది అగుదురు. |
| हे ईश्वर, मेरी नाव पार लगा दे। | భగవంతుడా ! నా నావను దరి జేర్పుము (నన్ను గట్టెక్కించుము). |
| कल क्लास में मास्टर ने मेरे गाल पर दो चपत लगाये। | నిన్న క్లాసులో మాష్టరుగారు నన్ను రెండు చెంపదెబ్బలు వేసిరి. |

---

## పాఠము 31.

### भर ప్రత్యయము

83. పరిమాణమందు పూర్ణతను తెల్పుటకు నామవాచకములకు దీనిని చేర్చెదరు. తెలుగున 'ఎడు' 'అంతయు' 'నిండుగ' మొదలగునవి దీనికి సమానవాచకములు.

ఉదా:—पेट भर, भर पेट కడుపునిండుగ. दिन भर, भर दिन దినమంతయు. घर भर ఇల్లంతయు. गाँव भर ఊరంతయు. गाँव भर में ఊరంతటిలో. घंटे भर గంటసేపు. ज़िन्दगी भर జీవితమంతయు, मुट्ठी भर పిడికెడు. चुल्लू भर పుడిసెడు. గుక్కెడు. लोटे भर చెంబెడు, प्याले भर గిన్నెడు.

84. होगा—'होगा' అనునది 'బహుశా ఉండవచ్చును', 'ఉండును' అను నర్థమున వాడబడును.

ఉదా:—वह घर में होगा వాడు యింటిలో నుండవచ్చును.
वही होगी ఆమెయే అయియుండును.
कोई कारण होगा ఏదియో కారణముండును.
वह ग़रीब होगा ఆమె బీదరాలై యుండును.

ప్రత్యుత్తరముగ చెప్పునపుడు గూడ నీయర్థమునే యిచ్చును.

ఉదా :—वे घर में होंगे ? వారు యింటిలో నుందురా ?
होंगे బహుశా ఉండవచ్చును.

85. चाहिये—24 వ పాఠములోని నియమములో చెప్పినటువలె గాక चाहिये 'కావలయును', 'వలయును' అను నర్థమందుగూడ వాడబడును. ఇది ఉపయోగింపబడినపుడు కర్త ఎల్లప్పుడు చతుర్థియందు को తో యుండును.

ఉదా :—आपको क्या चाहिये తమకేమి కావలెను.
मुझे थोड़ा पानी चाहिये నాకు కొంచెము నీళ్లుకావలెను.
उसको कुछ आम चाहिये వానికికొన్ని మామిడిపండ్లు కావలెను.

86. बिना లేనిదే, లేకుండా.

ఉదా :—खाये बिना లేక बिना खाये తిననిదే, తినకుండా.
गाये बिना లేక बिना गाये పాడనిదే, పాడకుండా.
पढ़े बिना లేక बिना पढ़े చదువనిదే, చదువకుండా.
कहे बिना లేక बिना कहे చెప్పనిదే, చెప్పకుండా.

87. थोड़े ही ఇది హిందీలో చాలా విచిత్రమైన ప్రయోగము. ఈ శబ్దము తన అసలు అర్థమును బొత్తిగా వదలి వ్యతిరేకార్థమును దెల్పును.

ఉదా :—वह चोर नहीं है వాడు దొంగ కాడు.
वह चोर थोड़े ही है వాడేమి దొంగనా ? (అనగా వాడు దొంగ కాడు).

పై రెండు వాక్యములలోని భేదమును పాఠకులు గ్రహించవలెను. ఇటులనే—

ఉదా :—मैं थोड़े ही जाता हूँ ? నేను వెళ్లుచున్నానా ?
मैंने थोड़े ही यह काम किया है ? నేనేమి యీ పనిని చేసితినా ?

